# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

Thirteenth Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the* 15*th April.* 1957

The House met at Half Past Two of the Clock

[MR. SPEAKER IN THE CHAIR]

QUESTIONS AND ANSWERS

(See Part I)

## Request for Half an hour Debate re : opening of Fair Price Shops.

మిస్టర్ స్పీకర్ :—శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, విశ్వేశ్వరరావుగారు, రత్నసభాపతి గారు చవక దుకాణాలను గురించి ఒక అర్థగంట చర్చ కావాలని అడిగారు, ఇది ఎన్నాళ్ళనుంచియో వస్తున్న విషయం ప్రతి మీటింగులోను దాదాపు వస్తున్న విషయమే. ఈ రోజున ఎంతో సేపు చర్చించాము? అందు వలన అర్థగంట చర్చ అవసరం లేదని త్రోసి వేస్తున్నాను.

## Adjournment motion re : Labour Situation at Guntur.

శ్రీ ఎం నాగిరెడ్డి (మాచెర్ల) :—మొన్న ఒక విరామ తీర్మానం ఇచ్చాను. హోంమంత్రిగారు వచ్చిన తరువాత పెడతాము అన్నారు. గుంటూరు బియ్యపు మిల్లులకు సంబంధించిన 400 మంది కార్మికులు నాలుగు నెలలనుంచి పనిలేకుండా వున్నారు. మంత్రిగారు ఒక నిర్ణయాన్ని ఇచ్చిన తరువాత కూడా యజమానులు అమలు చేయడం లేదు. ఇప్పుడున్న పరిస్థితులను ఆలోచించి మంత్రివర్యులు సమాధానం ఇవ్వవలసి యుంటుంది. 10-11-56 నుంచి మిల్లులను lock out చేశారు. తొమ్మిది మిల్లులలో పని చేసే 400 మంది కార్మికులు పని లేకుండా ఉన్నారు. యూనియన్ తరఫున మంత్రి వర్యులకు 3-12-56 న represent చేశారు, 16-2-57న మంత్రిగారు ఒక నిర్ణయాన్ని ఇచ్చారు. ఈ arbitration నిర్ణయాన్నికూడా ఇంతవరకు అమలు చేయలేదు.

మిస్టర్ స్పీకర్ :—విరామ తీర్మానములగురించి తరువాత చూసుకొందాం.

## Admonition of Sri V. Sitaramayya S. I. Police.

*Mr. Speaker* :—The Hyderabad Legislative Assembly of which this Andhra Pradesh Legislative Assembly is the principal successor has adjudged you V. Seetharamiah, Sub-Inspector of Police guilty of the offence of breach of privilege and contempt of the House for not reporting with the reasons therefor to the Speaker, the arrest made by you of Sri K. L. Narasimha Rao, a member of the House, on 24-5-1952 and awarded you the punishment of admonition before the Bar of the House. I have accordingly issued a warrant to the Inspector-General of Police to produce you and you are before me today in this august House. Have you anything to say ?

[Sri V. Seetharamiah, Sub-Insepctor of Police, handed a letter to Mr. Speaker.]

*Mr. Speaker* :—Sri V. Seetharamiah, Sub-Inspector of Police, has given an unconditional apology and it is as follows:

"I plead guilty of the charge. I hereby tender an unconditional apology. I request you to pardon me."

I accept the apology. Now I order you to withdraw.

[At this stage, Sri V. Seetharamaih, Sub-Inspector of Police, withdrew from the house.]

[Sri K. L. Narasihma Rao rose in his seat]

*Mr. Speaker* :—When I am on my legs, the hon. Member should not stand.

## Business of the House.

మిస్టర్ స్పీకర్ :—తరువాత అంశము. గోదావరిలో భద్రాచలంవద్ద జర్గిగిన విషాద సంఘటన గురించి 17వ తారీఖున 11 గంటలు మొదలు ఒంటి గంట వరకు రెండు గంటలు చర్చించడానికి time ఏర్పాటు చేస్తున్నాను. రేపటి నుండి ఉదయం 8–30 మొదలుకొని ఒంటి గంట వరకే సమావేశం జరిపించమని పార్టీనాయకులు కోరిన దానికి సభానాయకులు అంగీకరించారు. కనుక మళ్ళీ టైము మార్చుకునే వరకూ ఉదయాన 8–30 మొదలుకొని ఒంటి గంట వరకే యీ మీటింగు జరుగుతుందని తమకు మనవిచేస్తున్నాను. దీనిలో vote తీసుకోవలసిన దేమీలేదు. కాబట్టి ఈ నిర్ణయం చేశాను. మీరందరు దీనిని సంతోషముగా అంగీకరించండి.

శ్రీ యం. నాగిరెడ్డి :—నా విరామ తీర్మానం గురించి చెప్పండి.

మిస్టర్ స్పీకర్ :—తరువాత వస్తాం.

గోపిడి గంగారెడ్డి (ముధోల్) :—ఈ బిల్లులన్నీ ఆంగ్లంలో వున్నాయి. వాటిని తెలుగులో తర్జుమా చేయించే ప్రయత్నం వుందా, లేదా అని అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—ప్రస్తుతం ఆంగ్లమే మన శాసనసభ భాష. వీలైనంతవరకు తెలుగులో యిస్తున్నాం. దానిని మార్చుటకు Ad hoc కమిటీని వేయడం గురించి ఆలోచిస్తున్నాం. దానికి సభా నాయకులు కూడా అంగీకరించారు. నెమ్మదిగా వస్తుంది. అంతవరకు మిశ్రమంగా వుంటుంది.

శ్రీ కె. రామచంద్రారెడ్డి—(రామన్నపేట) : గత ప్రభుత్వం ఆంగ్లములో వున్న అంశములను తెలుగులో అచ్చువేసి యిచ్చేవారు. ఈ ప్రభుత్వం ఆ మాత్రం చేయకుండా వుంటే ఎట్లా ?

మిస్టర్ స్పీకర్ :—దాని విషయమై ప్రభుత్వమును కనుక్కుంటాను. నా దగ్గరకు కొన్ని విరామ తీర్మానములకు నోటీసులు వచ్చినవి. వాటిని విరామ తీర్మానములుగా ఒప్పుకుంటేనే మీరు మాట్లాడాలిగాని లేకపోతే మాట్లాడ కూడదు. నేను ఆ తీర్మానాన్ని చదివి త్రోసివేసిన తరువాత సభ్యులు గాని మంత్రులుగాని మాట్లాడ వలసిన అవసరం లేదు. మొదటి విరామ తీర్మానం శ్రీ రామస్వామిరెడ్డిగారిచ్చినది. గ్రామోద్యోగులు ముఖ్యంగా గుంటూరు జిల్లాలో—తమ జీతాలు పెంచవలసినదనీ, జమాబందీ కాలాన్ని జూలైవరకు పొడిగించాలనీ లేనిచో సత్యాగ్రహము చేస్తారని అందుచేత తొందరగా చేయాలనీ యీ విరామ తీర్మానం ప్రభుత్వమును బెదరింప జూచే యీ తీర్మానము త్రోసివేయడమైనది.

## Adjournment motion re: Police Atrocities in Jogipalli.

మిస్టర్ స్పీకర్ :—శ్రీ బసవ మానయ్యగారు జోగివల్లిలో పోలీసుల దౌర్జన్యము గురించి యిచ్చిన విరామ తీర్మానం. 14-3-57 తేదీన జోగివల్లిలో కొంతమంది దౌర్జన్య పరులు బలవంతంగా యిండ్లలో జొరపడి రాజేశ్వరరావు, యం. యల్. ఎ., మొదలైన వారిని కొట్టారని వున్నది. పోలీసువారు ఏమి చేశారని లేదు. ఏది ఎట్లా వున్నా పై అధికార్లకు తెలుప వలసియున్నది. వారివల్ల మీకు న్యాయం కలుగక పోతే న్యాయమైన చట్టబద్ధ పద్ధతులను Constitutional methods అవలంబించ వలసియున్నది. That this august House should adjourn for such local affairs is not right. Therefore I rule this as out of order.

## Labour Situation at Guntur.

మిస్టర్ స్పీకర్ :—శ్రీ నాగిరెడ్డిగారు ఒక విరామ తీర్మానం తెచ్చారు. పాత కార్మికులను తీసి కొత్త కార్మికులను పెట్టారని, కొత్త కార్మికులను పెట్టడం గురించి చూచేవారు, Labour officers, tribunals కార్మికులపై దౌర్జన్యాలను అరికట్టడానికి జిల్లా అధికారులు వున్నారు. ఈ august House అటువంటి అల్లరుల గురించి వాయిదా వేయడానికి వీలు లేదు. 74వ నిబంధన క్రింద శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారిచ్చిన విజ్ఞాపన మంత్రిగారికి పంపిస్తాను. వారు తమ వీలువెంబడి జవాబు చెబితే బాగుంటుంది. అదే న్యాయం.

మంత్రిగారు ఎప్పుడు జవాబు చెప్పగలరో చెబితే వారికి అందజేస్తాను.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు (నందిగామ) :—ఇదివరకే ఆ విషయం మంత్రిగారి దృష్టికి తేబడింది. ఇప్పుడు వారేమైనా తెలవిస్తారేమోనని మీద్వారా అడుగు తున్నాను.

మిస్టర్ స్పీకర్ :—మీ తరఫున నేను మంత్రిగారిని అడుగుతున్నాను.

శ్రీ వి. బి. రాజు (కార్మిక శాఖా మంత్రి) :—భోగట్టా ఎప్పుడు వస్తే అప్పుడు ఇస్తాము.

మిస్టర్ స్పీకర్ :—ఎల్లుండి రావచ్చునా ?

శ్రీ వి. బి. రాజు :—ప్రయత్నం చేస్తాం.

మిస్టర్ స్పీకర్ :—ప్రయత్నం చేస్తాం అన్నారు: గనుక యింతకన్నా వారిని నిర్బంధించడానికి వీలులేదు.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు :—వారి దగ్గర నున్న కొద్ది భోగట్టా చెబితే బయట ప్రజలు తృప్తి పడతారు.

శ్రీ వి. బి. రాజు :—ఎల్లుండి సవిస్తరంగా ఒక statement ఇస్తాను.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) :—అధ్యక్షా ! మీరిప్పుడు ఒక రూలింగు ఇచ్చారు, ఆ రూలింగ్ ప్రకారము పనిచేయటానికి, వివరాలు లేకపోతే కొన్ని సమస్యలు వస్తున్నాయి. గుంటూరులో ఏమో జరిగిందన్నా, ఎక్కడో ఏదో గ్రామములో దుండగులు వచ్చి పడుతున్నా రన్నా, బ్రహ్మాండమైన, పవిత్రమైన ఈ శాసనసభ adjourn చేయటం ఎలా సాధ్య మవుతుంది, అన్నారు. ఈ శాసనసభలో దెబ్బలాటు జరిగి, ఎవరో ఒకరి తలపగిలితే, లేకుంటే గందరగోళం జరిగితే, adjourn చేయుట మనకు సాంప్రదాయమా అని అడుగు తున్నాను. అక్కడ పోలీసు లున్నారు. మెజిస్ట్రేటులున్నారు. కలెక్టర్లు వున్నారు. డిప్యూటీ కలెక్టర్లువున్నారు. ఇంకా చాలా సిబ్బంది వుంది. వారు న్యాయం చేకూరుస్తారని అనవచ్చు. కాని అక్కడ సరైన న్యాయం జరుగలేదు కాబట్టి, ప్రజా వేదిక మీద నుండి ప్రజల దృష్టికి ప్రభుత్వ దృష్టికి ఈ విషయాలు తీసుకురావలసిన బాధ్యత ప్రతి శాసన సభ్యునకుడుంది. Attention of the Minister కొరకు ఇటువంటి adjourment ఇక్కడకు తీసుకురావటము జరిగింది. పై చెప్పిన విషయములు సక్రమ రూపములో వున్నవా, లేవా అనేదానికి మీరు Ruling ఇవ్వాలి. అందుచేత దానిని గురించి కొంచెం దీర్ఘంగా ఆలోచించి, Adjournment motion లో సభ్యుల హక్కు కాపాడటానికి మీరు రూలింగ్ ఇవ్వవలసి వుంటుందని నేను చెప్పుతున్నాను.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ (చిన్న కొండూరు) :అప్పుడు ఒక్కటే Point of order అయినది. ఇప్పుడు రెండైనాయి. మొట్టమొదట మీరిచ్చిన Point of order సరియైనది కాదని, మళ్ళీ పునరాలోచించి Point of order ఇవ్వాలని, చర్చకు అవకాశం ఇవ్వటం క్రమబద్ధమైనదా అనే దానికి మీరు రూలింగ్ ఇవ్వాలని కోరుతున్నాను. ఒకరు ఉపన్యాసం ఇస్తున్నప్పుడు ఎవరైనా సభ్యుడు Point of order కోరినట్లయితే, ఆ Point of order వారిని కూర్చోపెట్టి, ఉపన్యాసం ఇచ్చేవారికి అవకాశం

ఇవ్వటము, వారి ఉపన్యాస విషయములోనే Point of order వున్నప్పుడు ఆ Point of order ను మొదటే decide చేయవలసిన అవసరము సభకు వుంటుంది. Point of order అని ఎవరైతే అంటారో వారికి వెంటనే అవకాశం ఇవ్వవలసిందా, లేక తరువాత ఇవ్వవలసినదా ? ఈ రెండు విషయాలలో తమరు రూలింగ్ ఇవ్వ వలసిందిగా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—ముందు వాటికి రూలింగ్స్ ఇచ్చిన తరువాత మీ Point of order కు వస్తాను. వారు నా ruling ను question చేయలేదు. కొన్ని too much గా వుంటే, వాటి విషయములో ఎంతవరకు అనేదానిని గురించి ఆలోచించమన్నారు. దాని విషయములో ఆలోచించటానికి నాకు అభ్యంతరము లేదు. ఈ పూట ఇచ్చిన Point of order ను question చేస్తే తప్పు. Contempt గూడా అవుతుంది. కనుక అదికాదు. ముందు జనరల్‌గా ఒకపాలసీ గురించి వారు అడిగారు గనుక దానిని సీరియస్‌గా ఆలోచిస్తున్నామని Leader of the opposition గారికి తెల్పుతున్నాను.

శ్రీ బసవ మానయ్య :—అధ్యక్షా, నా Adjournment motion వచ్చినప్పుడు కొంచెం ఆగండి, ఆగండి, అని అరగంట అయినది అది జోగిపేటలో M.L.A. గారిని .................. ...

మిస్టర్ స్పీకర్ :—అది అయిపోయింది. చదివాను.

శ్రీ బసవ మానయ్య :—సరిగ్గా చదవలేదండి.

మిస్టర్ స్పీకర్ :—చదివాను you should not say so. నేను బాగా చదువకపోయినా చదువలేదని మీరు అనకూడదు.

శ్రీ జె. ఆనందరావు (మెట్‌పల్లి) :—అధ్యక్షా, గత అసెంబ్లీలో వున్న సాంప్రదాయము ఏమిటంటే Adjournment motion ఏదైతే ఇవ్వబడుతుందో, ఆ కాపీని స్పీకరుగారు చదివి వినిపించటము, తరువాత Adjournment motion తెచ్చిన సభ్యుడు దాని వివరాలను సంగ్రహాముగా చెప్పటము, దానికి సమాధానముగా మంత్రిగారు ఏదైనా relief ఇచ్చి వున్నట్లయితే ఇచ్చారని, లేకపోతే ఇవ్వటానికి వీలులేదని, లేదా యింకా పూర్తి వివరాలు రాలేదని చెప్పేవారు. ఆ తరువాత స్పీకర్ దానికి చర్చ ఈనాడు అవసరంలేదని మరునాడు చర్చ చేస్తామని లేదా అసలు చర్చే అవసరము లేదని, రూలింగ్ ఇచ్చేవారు. కాని ఇప్పుడు Adjournment motion ఏమవుతోందో తెలియడము లేదు. స్పీకరుగారు ఏమిచెబుతున్నారో తెలియటము లేదు. కాబట్టి ఆ సాంప్రదాయము పాటిస్తారా ?

మిస్టరు స్పీకరు :—వారెవరైనా చేస్తే రూల్సు తెలియకచేశారు. నేను చేస్తున్నది Correct rule. నేను Adjournment motion admit చేస్తే మీరు వారు మాట్లాడటము admit చేయకుండా పూరికే చదివి, ఇది adjournment క్రిందకు రాదు అని కొట్టి వేయటానికి అధికారమువుంది. మేము వున్న రూలు ప్రకారము చేస్తున్నాము. దానిని మీరు question చేయటానికి అధికారములేదు

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) :—Point of order Sir, నేను Adjournment motion ఇచ్చాను. నెల్లూరు పింగాణీవారి సమ్మె గురించి ఇచ్చాను.

మిస్టర్ స్పీకరు :—రేపు వస్తుందేమో చూస్తాము.

శ్రీ బసవ మానయ్య :—నేనిచ్చిన Adjournment ఒప్పుకోలేదు. కొట్టి కొట్టివేశారు. నేను ఒప్పుకొన్నాను. కాని అది సరిగా వినిపించాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—Adjournment motion ను Admit చేయక ముందే, సభకు తీసుకురాకుండా Chamber లో కొట్టేసే పద్ధతి వుంది. అది గాకుండా సభకు వచ్చిన తరువాత, నేను దీనిని అంగీకరించటము లేదు అని స్పీకరు చెబుతారు. ఒక వేళ దానిని admit చేస్తే వారికి నోటీసు ఇవ్వటం, దానిపై విచారణ జరుగుతుంది. ఇది మొదట్లోనే కొట్టేశాను కనుక మీరు చెప్పింది దీనికి వర్తించదు.

శ్రీ పి. ఎస్. అప్పారావు (పాలకొండ) :—అధ్యక్షా, మేము 12వ తేదీన ఇచ్చాము. దానిని తోసివేశారో, పైకి తెచ్చారో, Chamber లో వుంచారో తెలియదు. మంచి గాని, చెడ్డగాని మీరు చెప్పటము లేదు మంత్రిగారి దృష్టికి తెచ్చుని ఇదివరకే ఇచ్చాము. ఆ కాగితము కన్పించదు. మూడు కాపీలిచ్చినా దిక్కు లేకపోతే మేము ఏమిచేయాలి ?

మిస్టర్ స్పీకర్ :—20వ తేదీ వరకు గడువు వుంది.

శ్రీ పి. ఎస్. అప్పారావు :—15వ తారీఖు, అన్నారు.

మిస్టర్ స్పీకర్ :—సరే చూస్తాము. మీ దానికంటెపముందు వచ్చినవి వున్నాయి.

శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ :—రేపటినుంచి సభ ఉదయం 8—30 గంటల నుంచి మధ్యాహ్నం 1 గంటవరకు జరుగుతుందని చెప్పారు. డిప్యూటీ స్పీకర్ ఎన్నిక రేపు మధ్యాన్నము 3 గంటల వరకు జరుపబడుతుందని యిదివరలో సర్క్యులర్ పంపారు. నామినేషన్ టైము అయిపోయింది. అందువల్ల ఎన్నికలు జరుగ వలెనో, లేదో పోటీ వున్నదో లేదో తెలియజేస్తారా?

మిస్టర్ స్పీకర్ :—రూల్సు ప్రకారం ఎవరు ఎన్నికైనదీ రేపు డిక్లేర్ చేస్తాము.

[*Mr. Deputy Speaker in the Chair*]

## The Andhra Dowry Prohibition Bill, 1956

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—ఈ దినం అనధికార దినం. అనేక మంది సభ్యులు పంపిన అనధికార బిల్లులు తీర్మానాలు వున్నాయి. వాటిలో మొదటిది వరకట్న నిషేధ బిల్లు. ఐతే యీ బిల్లుకు నోటీసు యిచ్చిన గౌరవ సభ్యులు ప్రస్తుతం సభలో లేరు. ఈ బిల్లును ప్రతిపాదించుటకు ఎవరైనా ఆమె వద్దనుంచి పత్రము తెచ్చి వుంటే దానిని ప్రతిపాదించవచ్చు. లేనిచో ఈ బిల్లును వాయిదా వేస్తాను.

(బిల్లు వాయిదా వేయబడినది)

## The Cows and She-Buffaloes Slaughter Prohibition Bill, 1956

*Shri P. Venkatasubbaiah* :—Mr. Deputy Speaker, Sir, I beg to move :

"That the Cows and She Buffaloes slaughter Bill, 1956, be referred to a Select Committee Consisting of fifteen members."

శ్రీ పి. వెంకట సుబ్బయ్య:—ఉపాధ్యక్షా, ఈ బిల్లుపై ప్రజాభిప్రాయం సేకరింపబడింది. 16 సంస్థలనుంచి 17,410 మంది వ్యక్తులనుంచి, 6 బహిరంగ సభల తీర్మానముల ద్వారా, 4 మునిసిపల్ కౌన్సిల్సునుంచి, యీ బిల్లును బలపరుస్తూ తీర్మానములు వచ్చాయి. ఈ అభిప్రాయము లిచ్చినటువంటి వారు యీ బిల్లులో కొన్ని మార్పులను చేయవలసి యుంటుందని సూచించారు. కనుక యీ బిల్లు సెలెక్టు కమిటీకి పోయినట్లయితే అన్ని విషయములనూ సమగ్రంగా పరిశీలించి సమగ్రమైనటువంటి బిల్లును తీసుకొని రావడానికి వీలుంటుందనే ఉద్దేశముతో దీనిని సెలక్టు కమిటీకి పంపవలసినదని ప్రతిపాదిస్తున్నాను. మంత్రిగారు కూడా యిట్టి బిల్లుకు ఆమోదం తెలిపారు గనుక ఎవరికి ఎట్టి అభ్యంతరం వుండ నవసరం లేదు

*Sri P. Timma Reddy* :—I am not oppoising the Bill This may be referred to the Select Committee.

*Mr. Speaker* :—Motion moved.

"That the Cows and She-Buffaloes Slaughter Bill, 1956, be referred to a Select Committee Consisting of 15 members.

شری محبوب علی خاں :— صدر محترم - شری وینکٹ سبیا نے گاؤکشی کے متعلق ایک بل پیش کیا ھے - میں ایوان سے اس سلسلہ میں یہ عرض کرنا چاھتا ھوں کہ یہ چیز آج سے نہیں بلکہ ھزارھا سال سے چلی آرھی ھے اور کبھی بھی مذھب میں دخل دینے کی نوبت نہیں آئی - ایک زمانے سے گاؤکشی ھورھی ھےلیکن اس کے باوجود ھزارھا بیل اور گائے اب بھی موجود ھیں - اگر گاؤکشی بند کردیجائے تو پھر جب یہ جانور ناکارہ ھو جائینگے تو ان کو دانہ اور چارہ کہاں سے میسر ھوسکے گا اس چیز کو مد نظر رکھنا چاھیئے سابق کے راجاؤں نے - بادشاھوں نے - برٹش گورنمنٹ نے اور پچھلی ریاستوں نے اس معاملہ میں کسی قسم کی مداخلت نہیں کی - میرا یہ کہنا ھے کہ آپ میناریٹیز کو ساتھ لیکر چلئیے - اوہیں فیسیلیٹیز دیجئیے - مائیناریٹیز کے حقوق کی حفاظت کیجئیے - کیا یہی مائیناریٹیر کے حقوق کی حفاظت کا طریقہ ھے - ھمارے مذھب میں جو چیز روا ھےاوس کی ممانعت کی جارھی ھے - اوس کو بند کیا جارھا ھے - نہ کبھی اس کے پیشتر ایسی چیز ھوتی تھی اور نہ آئندہ ھونے کی مجھے امید ھے - آپ میجاریٹی سے اس کو کرسکتے ھیں - آپ کامیاب ھوسکتے ھیں - بل بھی پاس ھوسکتا ھے -

مسٹر ڈپٹی اسپیکر :— آپ بھی میجارٹی میں ھیں :—

شری محبوب علی خاں :— ھم میجارٹی میں نہیں ھیں۔ آئندہ ممکن ھےایسا بھی ھوسکے کہ فلاں سڑک پر مسجد ھےلہذا اوس کو شہید کردیا جائے اس طرح مذھب میں مداخلت کرنا میرے نزدیک مناسب نہیں ھے۔ اس لئے میں ایواں سے درخواست کرتا ھوں کہ اس بل کو الاؤ نہ کیا جائے اگر الاؤ بھی ھو جائے تو اس کو نظر انداز کردیا جائے۔

श्री बसवा मनिया:– जनाबे सदर। जिन खियालात को अभी हाउस के सामने रखा गया है उसको एक मजहबी रंग दिया जारहा है। भारत वर्श में ८० प्रतिशत लोग काशतकार है। जिरात के लिये बैलों को आवशय्कता है। यदि गाये को हजारों लाखो की तादाद मे काट डालाजाये तो इस से जिरात पर असर पडेगा। भारतवर्श की मेजारिटी जो कृषि से संबंध रखती है उसकी सहायता के लिये गौरक्षा अनिवार्य है। यह तो आर्थिक दृष्टि से हुआ। दूसरे मजहबी दृष्टिसे भी देखा जाये तो यह जरूरी है। मौलाना ने फरमाया कि राजाओके जमाने मे बादशाहोके जमाने में यह ब्रिटिश राज मे कभी इसको नही रोका गया है। मै उन्हे बतलाना चाहता हू कि अकबर के जमाने मे बीरबल ने गौरक्षा का प्रय,त्न किया था यह इतिहास में है कि अकबर बादशाह ने भी गौरक्षा की कोशिश की थी। यह आर्थिक दृष्टि से अनिवार्य है। गोश्त खाने वालो के लिये और कओ जानवरहे। बकरी या मुर्गियो का गोश्त खा सकते है। यह बिल तो केवल गाये के संबंध में है। गौ के संबंध में डाकटरों ने यह विचार रखा है कि गाये का दूध बच्चो के लिये अनिवार्य है। मा के मरने के बाद बच्चे को जिन्दा रखने के लिये यही गाये का दूध बच्चे की रक्षा कर सकता है। कृषिकी दृष्टि से भी गौ रक्षा अनिवार्य है। जब इस में हमारी देश की मेजारिटी का लाभ है तो इस से माअिनारिटी को सकोच्ति न होना चाहिये। मैं हाउस से प्रार्थना करूगा कि वह इन बातो को ध्यान मै रख कर इस बिल पर विचार करें।

శ్రీ గోపిడి గంగారెడ్డి :—ఉపాధ్యక్షా, గోహత్య నిషేధం వుండాలని ఏదైతే గౌరవనీయులైన సభ్యులు పెట్టినారో దాని విషయంలో మతమునకు సంబంధించి కొంతమంది మాట్లాడుతున్నారు. ముఖ్యంగా ఆవులను కోయవలెనని వారి మతములో ఎక్కడైనా ఉన్నదా అని వారిని అడుగ తున్నాను.

कुरान शरीफ में भी तो यह नही है कि किसी का खून बहाया जाये।

ఈ విధంగా ఖురాన్‌షరీఫ్‌లో చెప్పబడింది ఎవరి రక్తము తీయవద్దని ఉన్నది. అందుచేత రక్తం తీయకుండా ఆవులను ఎట్లు కోయగలరు, వాటి మాంసము ఎట్లు స్వీకరించగలరో అర్థం కావడం లేదు. ఖురాన్‌షరీఫ్‌లో ఎక్కడాకూడా ఆవులను కోయాలనిగాని, లేక ఇంకేదాని రక్తము తీయాలని గాని చెప్పబడలేదు. కాబట్టి ఈ విషయం మతమునకు సంబంధించి చెప్పడం సరియైనది కాదు అందుచేత మా మతాన్ని అడ్డగిస్తున్నారని చెప్పుతున్నారంటే, ఒక విధమైన మతప్రచారాన్ని చేసి భేదం తీసుకువచ్చి పెట్టడమే అవుతుంది గాని మరేమీ కాదు.

ఖురాన్ షరీఫ్‌లో ఎక్కడైనా ఆవులను గాని, మరే దేనినైనాగాని కోయవలెనని వున్నదేమో దానిని స్పష్టంగా చదివి చెప్పవలసిందని వారిని నేను కోరుతున్నాను. ఇంతకు ముందు ఒక గౌరవ సభ్యుడు మాట్లాడుతూ, ముసలి ఆవులు వుంటే, వాటికి మేత ఎట్లా పెట్టేదానికి వీలవుతుంది అని అన్నారు. ఆ విధంగా అయితే వృద్ధాప్యం చెందిన మనుష్యులు ఉన్నారు గదా, మన తండ్రులు తాతలు, మునితాతలు వీరందరు వున్నారు గదా? వీరికి ఆహారం ఏవిధంగా పెడుతున్నాము. వాళ్ళు చనిపోయిన తరువాత కూడ వాళ్ళకు పాలు పోయవలెనని అంటున్నారు గదా. కనుక ముసలివారైన మనుష్యులను కూడా ఆహారం పెట్టలేక చంపగలిగినట్లయితే ఆవుల విషయంలో కూడ వారు చెప్పిన విధంగానే చేయవచ్చు. అందులో ఏమీ భేదము లేదు. అందుచేత గౌరవసభ్యుడు ఈ విషయాన్ని సరియైన దృష్టితో చూడలేదని మనవిచేస్తున్నాను ముసలివి అయినప్పటికీ ఆవులకు వేసిన మేత ఏమి నష్టము కాదు దాని పెంట ఎరువుకును. ఇంకా ఇతర విధంగా కూడా ఎంతో వుపయోగపడుతున్నది. అంతే కాకుండా, బలహీనమైనటువంటి, రోగము గలిగి నటువంటి పశువులను తింటే, బలహీనులు, రోగులే అవుతారని డాక్టర్లు సెలవిచ్చారు గదా. అటువంటప్పుడు, బలహీనమైన రోగములు కలిగినటువంటి వాటిని ఎందుకు తిన దలచారో అర్థం కావడం లేదు. ఆ విధంగా వాటిని తిని బలహీనమై త్వరగా చనిపోవాలని వారి మతం చెబుతున్నదా ? అందుచేత గోహత్య చేయకూడదని ఈ గోహత్య నిషేధం విషయాన్ని అందరు అంగీకరించి ఈ చట్టాన్ని ఆమోదించవలెనని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ ఎన్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం—జనరల్) :—ఉపాధ్యక్షా, ఈ బిల్లును తీసుకునివచ్చినందుకు మిత్రులు వెంకటసుబ్బయ్యగారిని నేను అభినందిస్తున్నాను ప్రభుత్వమే ఇలాంటి బిల్లును తీసుకునిరావలసింది. శతాబ్దాలనుంచి కూడా ఇలాంటి ఉద్యమం వున్నది. అందులో ప్రత్యేకం గత 50 సంవత్సరాలునుంచి, గోహత్యా నిషేధం గురించి శాసనాన్ని తీసుకుని రావలెననేటటువంటి ఉద్యమం బాగా వున్నది. ఇది చాలా అవసరమైన శాసనము. ఇలాంటి శాసనాన్ని ఇప్పటికైనా సరే ప్రవేశ పెట్టుటకు మన మిత్రులుచేసిన కృషికి వారిని నేను అభినందిస్తున్నాను, దీనిని మతంతోటి ముడి వేయడము అనేది చాల పొరపాటు. మన కర్నూలు శాసనసభ్యులు ఆ విధంగా మాట్లాడటం ఎంతమాత్రంకూడా సమంజసంగా లేదు. అసలు మన దేశము వ్యవసాయిక దేశము. మన ఆర్థిక అభివృద్ధి అంతకూడా మామూలుగా గోవుల తోటి, ఎద్దులతోటి, దున్నల తోటి గేదెలు మొదలైన వాటితోటి కూడుకొని ఉన్నది. ప్రత్యేకంగా గోవు అంటే అది ప్రజలకు ఎంతో వుపయోగ పడుతున్నది. దానిని బట్టి ఆవుకు ప్రత్యేకమైన గౌరవము ఏర్పడింది. కనుకనే దానిని పూజించడమనేది కూడా ఏర్పడింది. తల్లిపాలకంటె కూడా ఆవుపాలు మంచిది. ఆవుపాలు చేత బిడ్డలందరిని పెంచడము జరుగుతున్నది. మన మందరము కూడ పెరగడం జరుగుతున్నది. ఇంకా ఎన్నో విధాలుగా గోవు ప్రజలకు సేవ చేస్తున్నది. కనుక ఆ విధంగానైనా దీనిని ఆలోచించి ఈ చట్టాన్ని తీసుకు రావలసిన అవసరము వున్నది. మునిసిపాలిటీలలో కూడ ఇలాంటి తీర్మానము పెట్టినప్పుడు అక్కడ కూడా ఇలాంటి మత సంబంధమైన ఆక్షేపణలు తెలపడము జరిగింది. కాని దీనిని సరియైన దృక్పథంతో ఆలోచిస్తే దీనికి ఎలాటి ఆక్షేపణలు ఉండ నవసరం లేదు. ఈ విషయంలో ఎలాటి అనుమానాలు, విద్వేషాలు పెట్టుకోవడం మంచిదికాదు. దీనిని గురించి తర్జన చేయడం కూడ పొరపాటు. ఇదీ లేని పోని ద్వేషాలకు దారితీస్తుంది. ఈ బిల్లు విషయంలో చాలా చోట్ల నుంచి ప్రజాభిప్రాయం

కూడ వచ్చింది. కాని మళ్ళీ దీనిని సమగ్రంగా జాగ్రత్తగా, పరిశీలించి జయప్రదంగా ఈ శాసనాన్ని అమలు జరిపే విధంగా అన్ని విధాలా బాగుండే రూపములో తీసుకు రావడానికి సెలెక్టు కమిటీకి పంపుతున్నారు. ఇది చాలా అవసరమైనట్టి శాసనం కాబట్టి నేను దీనిని బలపరుస్తున్నాను.

శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి (కోస్గి) :—ఉపాధ్యక్షా, ముఖ్యంగా ఈ బిల్లును మన హరిజన మిత్రుడైన వెంకటసుబ్బయ్యగారు ప్రతిపాదించడం చాలా సమంజసంగా ఉన్నది. మా మూలుగా గోమాంసము ఇతర మాంసములు తినేటటువంటి జాతికి సంబంధించిన వారే ఈవిధంగా దీనిని నిషేధించవలెనని చెప్పడం చాల సంతోషముగా యున్నది. దీనివలన ప్రజలకు చాలా క్షేమం కలుగుతుంది. కాని కొంతమంది మిత్రులు దీనికి communal colour ఇవ్వడం చాలా ఘోరము. చాలా విషాదకరమైనటువంటి విషయము. నూటికి 80, 85 మంది హిందువులు ఈ నిషేధాన్ని కోరేటప్పుడు ఏ కొద్దిమందిగావున్న ముస్లిములు దాన్ని ఆక్షేపించడం జరుగుతున్నదంటే, దీనికి ఒక communal colour ఇచ్చి హిందువులను ముస్లిములను రెచ్చగొట్టడం మాత్రమే జరుగుతుంది తప్ప మరేమికాదు. ఇది చాలా శోచనీయమైన విషయము. హిందువులు కాని, ముస్లింలు కాని, హరిజనులు కాని, గోవుపాలు అందరికీ అవసరమే గోవుపాలువల్లనే అందరి పిల్లలు రక్షింపబడుతున్నారు. అలాంటప్పుడు ఈ విషయంలో ఎటువంటి భేదాభిప్రాయాలు ఉండకూడదు. దీనికి ఒక communal colour ఇవ్వడం చాలా పొరపాటు. ఇంతకుముందు మామిత్రులు చెప్పినట్లు గోవుయొక్క ప్రతి పదార్థము చాలా అమూల్యమైనది. గోవుయొక్క దేహములో 32 లక్షలు దేవతలు ఉన్నారని, గోవుయొక్క ప్రతి అంశములోను, అణువులోను దేవతలు ఉన్నారనే పూజ్యభావము అందరికినీ ఉన్నది. పోనీ ఆ పూజ్యభావము లేకపోయినకూడా, దీనివలన ఏలాటి కష్టంగాని నష్టం కాని రాలేదు. ముసలివాటికి గడ్డి ఎట్లా పెట్టేది అంటున్నారు. ఇంతకుముందు మనమిత్రులు చెప్పినట్లు ముసలివారిని మన తాతలనుగాని, ముని తాతలనుగాని, చంపముకదా, కనుక ముసలివైనప్పటికినీ, అమూల్యమైన పూజ్యమైనటువంటి గోవులను చంపివేయడం అనేది చాలా ఘోరమైన విషయము. ఇలాంటి శాసనం ఇదివరలోనేఉత్తర హిందూస్థానములోనూ, ఇతర రాష్ట్రాలలోను అప్పుడే ప్రతిపాదింపబడి అమలులో ఉన్నది. ప్రక్కన మైసూరు రాష్ట్రములో కూడ ఇది అమలులోఉన్నది. అదే ప్రకారంగా మనకు కూడా దీనిని అమలుచేయడం అవసరము. దీనిని సెలెక్టు కమిటీకి పంప అనవసరం లేదుగాని దీనికి ఏవివివరణలులేకుండా సమగ్రంగా సరియైన రూపములో తీసుకవచ్చే ఉద్దేశంలో సెలెక్టు కమిటీకి పంపుతున్నారు. కనుక దీనిని అందరు whole hearted గా support చేయవలసిందని ప్రార్థిస్తున్నాను.

శ్రీ సి. పి. తిమ్మారెడ్డి (సిర్పేట్) :—అధ్యక్షా, నేటిరోజులలో కేవలం చట్టాలు చేయడమే పరిపాటి అయిపోయింది. గతంలో కేవలం ధర్మమే ప్రధానంగా, శాస్త్రాలే ప్రమాణంగా తీసుకొని ప్రజలు వాటికి బద్ధులై ఉండేడివారు. ఈ కాలంలో వాటికి అంత ప్రాముఖ్యం లేకుండా పోయింది. ఎవరైనా తప్పుచేస్తే దానికి శిక్ష ఉన్నదని, ప్రపంచానికి అతీతమైన ఒక భగవత్ శక్తి ఉన్నదని, అది శిక్షిస్తుందని, దానిని అనుభవించవలసి యుంటుందనే దానికి ప్రాధాన్యం లేకుండా పోతూవచ్చింది. సత్యం, న్యాయం, ధర్మం ఈ దృష్టితో విమర్శించటానికి వీలులేని పరిస్థితులు ఏర్పడినాయి. ప్రపంచం కేవలం మానవ బద్ధమై పోతున్నది. ప్రపంచ శక్తులను

విచ్చలవిడిగా ఉపయోగించుకోవచ్చుననే ధోరణి కలిగి ఉంటున్నారు. అది అరికట్టడానికి వాటిని చట్ట బద్ధం చేయవలసి వచ్చింది. నేటి రోజులలో సత్యాన్ని అణచిపెట్టి అబద్ధ ప్రచారమునకు, మోసమునకు స్థానం యిస్తున్నారు. కేవలం మానవుని కోసం ప్రపంచం ఉన్నదా? లేక ప్రపంచంలో మానవుడు ఉన్నాడా? ప్రపంచంలో ఎన్ని జీవరాసులు ఉన్నాయి? ఈ ప్రకృతిలో మానవుడు ఒక్కడే ఉండవలెనా? మిగతా జీవరాసులు ఉండవచ్చునా లేదా? దీని రహస్యం ఏమిటి? భోగించేవాడు, భోగింపబడే వస్తువులు వున్నవి కదా. ఏఏ వస్తువులు ఎవరు భోగించవలెననేది అర్థము చేసుకోవలసి యున్నది. ప్రపంచ పరిణామంలో నాలుగు తరగతులున్నవి. అన్నమయా ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములతో కూడుకొన్న పదార్థములు ఉన్నవి. అన్నమయ మయటే—స్థూల భాగమైన చెక్కరాయి; ప్రాణమయ మంటే—చెట్లు చేమలు అంటారు. వాటిలో అన్నమే కాదు—పెరుగుట, ఉండుట, విరుగుట అనే దశలతో కూడుకొని ఉంటవి. అన్నము, ప్రాణము కలిస్తే చెట్టు అంటారు; అన్నము, ప్రాణమేగాక మనస్సు కూడా కలిగినవి పశువులు అంటారు. వాటికి వివేకము, విజ్ఞాన కోశములేదు. వాటికి విమర్శనా జ్ఞానములేదు; మనస్సు ఉన్నది. పశుపక్ష్యాదులకు, మృగాదులకు సుఖదుఃఖాలు ఉన్నవి. వాటికి కూడా కోర్కెలు ఉన్నవి. అవి కూడా ప్రపంచంలో ఉండాలని, అనుభవించాలని, అనుకుంటాయి. పశుపక్ష్యాదులకంటె ఎక్కువైన వాడు మానవుడు. మానవునకు విజ్ఞాన కోశం విశేషించి ఉన్నది. బుద్ధి ఉన్నది. విమర్శనా జ్ఞానం కలిగిన వాడు మానవుడు. నేటి రోజులలో ప్రపంచం అంతా మానవుని చేతులలో ఉన్నది. మానవుడు అధినేతగా ఉండి నడుపుతున్నాడు. దానిని మానవుడు విచ్చలవిడిగా ఉపయోగించుకొంటున్నాడు. కాని మానవులలో కొన్ని తెగలు ఉన్నాయి కొందరు బలవంతులు బలహీనులను ఉపయోగించుకొన్నారు. స్లేవరీ విధానంలో ఆ ప్రకారం మానవులను ఉపయోగించుకుంటేనే రివల్యూషన్సు వచ్చాయి. మహాత్ముడు మొదలైనటువంటి వారు ఆఫ్రికా, తదితరచోట్ల బానిసత్వం పోగొట్టాలనే కదా ఉద్యమాలు నడిపారు. ఒకరిచేతలో శక్తి ఉంటే ధర్మప్రవర్తన కలిగి ఉండాలిగాని దానిని యిష్టంవచ్చినట్లు ఉపయోగించకూడదుకదా? ఏ విధంగా ధర్మబద్ధం చేయాలనే విషయం ఆలోచిద్దాము. ఒక జీవి జీవించాలంటే ఆకలి దప్పులతో కూడుకొన్న దేహాన్ని పోషించటం అత్యవసరం. దేహం పుష్టిగా ఉంటే అందులో ఉన్న జీవుడు ప్రశాంతంగాను ఉంటాడు. శరీరముతో కూడుకొన్న జీవుడు ప్రపంచంలో ఉంటున్నప్పుడు కొన్ని కార్యాలు చేయగూడదు. కాబట్టి శరీరమునకు తిండి ముఖ్యం. జీవించాలంటే తిండితినాలి. తిండి కోసమేకదా మానవుడు జీవించేది. కొందరు, పశుపక్ష్యాదులను తింటే మహాపాపం అంటారు. ఆకులు, కాయలు, పండ్లు తింటే పాపము లేదా? వాటికి కూడా ప్రాణం ఉన్నది కదా? చెట్టు ఏడుస్తుంది, దానిలో నుంచి నీరుకారుతుంది? అది ఎందుకు గమనించరు అని అంటారు. అది మాత్రం రక్తంకాదా? పశుపక్ష్యాదులను తినని పక్షపాత బుద్ధితో, లోపల ద్వేషబుద్ధి పెట్టుకొని చెప్పవచ్చునని అంటారు మనసు కలిగిన ఏ జీవికైనా సుఖదుఃఖాలు ఉన్నాయి. అవికూడా ఏడుస్తాయి, భార్యాబిడ్డలను చూచి అవికూడా మమకారం చెందుతాయి. చెట్లు చేమలకు అటువంటిది లేదు. వాటికి మనస్సులేదు. ఎరువువేసి నీరుపోస్తూంటే పెరుగతూ ఉంటాయి. మనకు ఫలసాయాన్ని యిస్తవి. పూర్వం దైవ సంపత్తి, అసురసంపత్తి అని ఉన్నవి. మాంసాహారులను అసురసంపత్తి అన్నారు. వారిలో రాక్షసత్వం ఉందన్నారు. మనం పెద్దపులులను

ఉపయోగిస్తున్నాం. మంచివి అంటామా ? లేదు చెడ్డవి అంటున్నాం. కాబట్టి మనలో అటువంటి వారిని రాక్షసులు అనాలామరీ ? ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని చూస్తే వాటిని ఉపయోగించుట ప్రధానంకాదు. ఎందుకోసం ఉపయోగిస్తున్నాం అనే విషయం గమనించాలి. అవి ఎందుకు సృష్టించ బడ్డాయి ? అవి ఎందుకు ఉండాలి ? అనే విషయం ఆలోచించాలి. కేవలం ప్రపంచాన్ని మానవుని కోసం సృషించాడు. అణువు, అణువులో భగవత్ శక్తి ఉంటూ మానవునికి కావలసిన విషయాలుకూడా అందులో పెట్టాడు. వాటిని ఉపయోగించాలి. భగవంతుడు, మానవునకు తెలివి యిచ్చి ప్రపంచంలో వదిలినాడు. ఏవి ఉపయోగించాలి, ఏవి ఉపయోగించ కూడదు, వాటిని ఎందుకు మనం ఉపయోగించుకోవాలి, అది తెలుసుకొని ప్రవర్తించాలి. ఉపయోగించే విధానం తెలుసుకోవాలి. మనవద్ద నౌకరు ఉంటే ఉపయోగించుకునే విధానం లేదా ? ఎవావరిని ఏ రకంగా ఉపయోగించాలో ఆలోచించాలి. స్వార్థ రహితంగా ప్రవర్తించాలి. సూర్యునకు పక్షపాతం ఉన్నదా ? ఉదయాస్తమానాలు సక్రమంగా జరుగుతున్నవికదా ? నదీ ఎక్కడో పుడుతుంది. ఎక్కడిడో లయం అవుతుంది. సముద్రంలో దానికి పక్షపాతం ఉన్నదా ? మంచీలేదు, చెడూలేదు. అటువంటిదే నిష్కామ కర్మ అంటారు. నిష్కామ కర్మఅంటే ఏ ఉద్దేశ్యము లేని కర్మ. నేను యిది చేస్తే నాకు యిది కావాలి అనే ఉద్దేశం లేకుండా చేసేదే నిష్కామ కర్మ అని చెప్పబడుతుంది. చెట్లు చేమలే కాకుండా, పశు పక్ష్యాదులకు మృగాదులకు ఏమి దృష్టి ఉంది ? స్వార్థం ఏమీలేదు. మనకు అక్కరకు వచ్చే ధాన్యం తీసుకొని, అక్కరకు రాని గడ్డి వాటికి మేత పెట్టితే తింటూ ఉంటాయి. అవి మనకు అక్కరక్క రానివి తీసుకొని, పుష్టికరమైన పాలు వగైరా మనకు యిస్తున్నాయి అంతే కాకుండా వాటి దూడలు ఎద్దులయి మనకు సేద్యమునకు అక్కరకు వస్తున్నాయి. మనకు నడచుట కష్టమయి బండ్లలో కూర్చుంటే లాగుతున్నాయి. ఇటువంటి పరిస్థితులు ఉంటే, వాటిని తినడం అనేది ఏమాత్ర సమంజసంగా కనిపించుట లేదు. మన మిత్రులు చెప్పినట్లు వాటిని ఎప్పుడో తిన్నారని యిప్పుడు తినటం తప్పుకాదని చెప్పారు. ఇదివరకు మనలను బానిసలుగా ఉపయోగించు కొన్నార్స కదా ? మనము యిప్పుడు బానిసలు ఎందుకు కాకూడదు ? బానిసలు అయ్యామని ఒప్పుకుంటున్నామా ? ధర్మము అనేది తన స్వవిషయంలో వచ్చేటప్పటి ఫ్లైయిల్ అవుతోంది. ఎదుటివాం విషయంలో చెప్పేధర్మమును తమ వైపుకు తిప్పుకోవాలి. మనము వాటిని తినాలని అంటున్నాము. మనలను తినాలన్న పెద్దపులిని ఒప్పుకుంటామా ? ఒప్పుకొనుట లేదే. కాబట్టి ధర్మము ఎప్పుడు నిరూపింపబడుతుంది. అనగా నీవు ఎదుటివాని నుంచి ఏది పొందుటకు యిష్టపడవో దానిని నీవు పరులకు చేయకుండా ఉండవలెను. ఎదుటివాడు నీకు ఏది చేస్తే మంచిదని భావిస్తావో, దానిని నీవు పరులకు చేయవలెను. ఇదియే ధర్మ సిద్ధాంతం. వివేకము కలిగిన మానవుడు దుర్బుడతలకు, దురభ్యాసాలకు పాలు కాకుండా విచక్షణా జ్ఞానం కలిగి ప్రవర్తించవలసి యున్నది. ఉత్తములు, వివేకులు అనిపించుకునే వ్యక్తులు, శాసనసభ్యులే కావచ్చు— పరిపాలకులు, పరిపాలితులు అని రెండు వర్గాలు ఉన్నవి. చేసే వర్గం ఒకటి, చెప్పే వర్గం ఒకటి రెండు వర్గాలు ఉన్నవి. చెప్పేవర్గం . అన్నీ సరిగా అవగాహన చేసుకోవాలి. అర్థము చేసుకొనుటయేకాదు, మిగతా వారికి చెప్పుటకు అవకాశం కావాలి. పాలకవర్గంలో పొరపాట్ల రాకూడదు. పొరపాటువచ్చినదంటే చాలా అనర్థదాయకం. డ్రైవరు పొరపాటు పడితే, బస్సులో వారికి ప్రమాదం సంభవిస్తుంది. డ్రైవరు కాకుండా, అందులో వ్యక్తి పొరబడితే అంత

లోందరు, బాధ లేదు పాలకవర్గం శ్రద్ధగా, జాగ్రత్తగా ఉండాలి. లేనిచో దేశానికి అవి యెంతయో కష్టదాయకంగా ఉంటుంది. అది దృష్టిలో పెట్టుకొని, పాలకవర్గం పొరపాటు బడితే చాలా నష్టమనే విషయం గమనించి ప్రవర్తించాయి. ధర్మానుసారంగా నడచు కోవాలి. ఇప్పుడు ధర్మము క్షీణిస్తోంది. దేశం ముందుకు వెళ్ళుతోందా అనే విషయం నాకు మాత్రం అనుమానమే. ఆధ్యాత్మికంగా వెనక్కు వెళ్ళుతోందని నేను భావిస్తున్నాను.

ఎందువల్లనంటే, యిప్పుడు ఉండేపరిస్థితులలో రాజకీయములలో చూడండి, పట్టణములలో చూడండి, మనకు నాగరికత అనేది ఎక్కడ ఎక్కువగా కన్పిస్తున్నదంటే, అది Educated Classes లో కన్పిస్తున్నది. వారందరు పట్టణములలో ఉండుటవల్ల వారిలో నాగరికత ఏమిటంటే సప్తవ్యసనాలన్నమాట. సప్తవ్యసనాలతో కూడుకొని ఉన్నదేనా నాగరికత? ఈ రోజున అది తప్పులేదట. ఏమి చేసినాకూడా తప్పులేదట. అదే నాగరికత అంటే అదే కాబోలు. అది నాకు అర్థముకావడములేదు. అందువల్లనే మనము దిగజారి పోతున్నాము. మనము ఉన్నతస్థాయికి పోవడము లేదని మనము దృష్టిలోపెట్టుకొని యీరూపములో మనము పోయేటట్లైతే, ఎన్నడో, ఏదో నరకము అని చెప్పుకుంటూ, దీనికి అప్పుడో, యిప్పుడో అది తయారు అవుతుందని నాకు భావన కలుగుతున్నది, కాని ప్రకృతి మారుతూ ఉంటుంది. ఎంతోమంది వచ్చారు, ఎంతోమందిపోయారు, యీపరిస్థితిలోనికి, కాని అంతమాత్రముచేత ఆనరకమునుంచి తప్పించుకోలేకపోయినారు. కాని భగవంతుడుకూడ చెప్పాడు, ఎప్పుడెప్పుడు ఏ అన్యాయాలు, చేసినా, ఎప్పటికప్పుడే తాను అవతార పురుషుడుగా పుట్టి, ధర్మమంటే ఏమిటో, అధర్మమంటే ఏమిటో, న్యాయమంటే ఏమిటో, అన్యాయమంటే ఏమిటో నిరూపిస్తానని చెప్పాడు. మనము ఒకవైపుగా చూస్తూ వెళ్ళుతున్నాము కాని, రెండవ వైపు చూడడము లేదు. ఎందుకంటే బ్రహ్మసృష్టిని ప్రారంభించినప్పుడు మొట్టమొదట తర్కము చదివాడు. వేదబద్ధమైనదానినే వేద మన్నాడు. వేదమేకాకుండా దానికి అనుగుణమైన జీవులను ప్రపంచములో సృష్టించాడు పుట్టిన జీవులుకూడా దానికి అనుగుణముగా ప్రవర్తించాలి. ఇప్పుడు మనకు Civil code Criminal code ఉన్నవి. వాటికి మనము ఒక చట్టము నిర్మించియున్నాము ఆ చట్టమును జడ్జీ చేతికిచ్చి, దానికనుగుణముగా ఆయనను న్యాయమును పరిపాలించమని చెబుతున్నాము. ఆయన ఆ విధముచేయక, దానికి అతీతముగా పోటీవచ్చే ప్రమాదము ఏమిటి? మానవుడు ముందుకు వెళ్ళాలి అంటేదానికి ఒక ప్రమాణము ఉన్నది. అయితే దానికి శాస్త్రము ఉన్నదా? ఒక సిద్ధాంతము ఉన్నదా? ఒక ధర్మము ఉన్నదా? ఈ రూపముగా వెళ్ళాలిఅంటే, అది మాత్రము సక్రమమైన పద్ధతి అని ఎవరైనా నిరూపించ గలుగుతున్నారా? ఎందుకంటే, బూజుపట్టిన పాత కళాయిలకు, పాతపురాణములకు కళాయి పెట్టినామని అనుకుంటున్నాముకాని, అవి ఉపయోగించుకుంటే, స్వార్థముకోసము వాటిని దృష్టిలోపెట్టుకొని, ఎవరో ఏమోచేశారనే ఉద్దేశ్యముతో మనముకూడా అది దృష్టి లో పెట్టుకొని, యీశాస్త్రములు అన్నీ నిజమేనా, యీకళాయిలు బూజు పట్టినవి, యివి బాగాలేదని అనుకోవడమేనా? అవి బాగాలేనప్పుడు కొత్తవి కావాలిగదా! ఇప్పుడు మనకు మహాత్ముడు ఉన్నాడు. ఆయన రెంటినీ ఒకసారి, ఒకే విధమునడిపించాడే! ఒక ప్రక్కన భజనచేశాడు. మరొక ప్రక్కన పారాయణ ప్రారంభించి చేశాడు. కాని భగవంతుడు అనేవాడు ఉన్నాడు. ఆయన అధిపత్యము క్రింద మనము ఉన్నామని గుర్తించాముకదా!

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ :—ఉపాన్యాసము కానివ్వండి. ధర్మశాస్త్రము చాలావుంది. ఏదైనా మాట్లాడ దలిస్తే, బిల్లుకు సంబంధించి మాట్లాడండి.

శ్రీ సి. పి. తిమ్మారెడ్డి :—ఇప్పటికే చాలా టైము అయిపోయింది. కాని మనము అనుకునే యీ బిల్లు రూపములో కాకుండా కొంత హృదయ రూపములో రావడము ప్రధానము. కాని మానవులలో కొంతవరకు హృదయ పరివర్తనము కలిగే పక్షములో, యీ బిల్లు తీసుకుని రావనవసరము లేదని చెబుతూ విరమిస్తున్నాను.

*శ్రీ బి. జీ. యం. ఎ. నరసింగరావు (కణితి) :—ఉపాధ్యక్షా, నామిత్రుడు పాలా వెంకట సుబ్బయ్యగారు తీసుకు వచ్చిన ఈ బిల్లులో ఉన్న ఆశయాలతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే యీ బిల్లుయొక్క ఆశయాలు గోరక్షణకు చాలవేమోనని నాకు అనుమానము. ఈ బిల్లులో గోవధ నిషేధము అని వున్నది తప్ప మరేమి లేదు. గోవధను నిషేధించటముతో సరిపోదు. గోసంరక్షణకు కూడ పూనుకుంటేనేగాని మన ఆశయము పూర్తిగా నెరవేరదు. ఒక ప్రక్కన యీ బిల్లు పెట్టి Interruption

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ :—ఈ బిల్లుకు సంబంధించి మాత్రమే మాట్లాడండి.

శ్రీ బి. జీ. యం. ఎ. నరసింగరావు :—బిల్లును గురించే మాట్లాడుతున్నానండీ. ఈ బిల్లు యొక్క ఆశయములు యిప్పుడు మనము చర్చిస్తున్నాము. బిల్లుయొక్క చర్చలతోపాటు మనయొక్క అభిప్రాయములు కూడ దీనిలో జతపరచినట్లయితే, యిది గోరక్షణకు గోవధకు తగిన కట్టు దిట్టములు చేసినట్లవుతుంది. అప్పుడే ఈ బిల్లు పూర్తి బిల్లు అవుతుంది. కాబట్టి గోరక్షణకు కూడ కట్టుదిట్టములు యీ బిల్లులో చేర్చవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

రెండవది మన ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతము గోవులు ఏ స్థితిలో వున్నవి అంటే, బక్కచిక్కి ఎండు డొక్కలతో ఊగిసలాడుచున్నవి. అవి గోవులు అని పిలువబడే స్థితిలో లేవు. ఆ విధముగా వుండడము మన భారత దేశమునకు భారత జాతికి సిగ్గుచేటుగా వున్నది. ఇతర రాష్ట్రములలో గోవులు ఏ పరిస్థితిలో ఉన్నవో చూడండి. ఎక్కువ పాడితో కళకళ లాడుతూ వున్నవి. ఇతర దేశాలలో కూడ ఆవులు బాగుగా పెంచబడుతున్నవి. మనము విదేశములనుంచి అనగా Australia నుంచి మనదేశమునకు రప్పించిన గోవులు చూడండి. అవి ఎన్ని పాలు యిచ్చునో యిక్కడ మన ఆవులు ఎన్ని పాలు యిచ్చునో వ త్యాసము చూడండి. అలాంటి పరిస్థితులు మన దేశములో కూడ శ్రద్ధ కలుగజేసుకోవాల్సి ఉన్నది. గోవులకు సరియైన మేత కాక పోషణ లేనందున, బక్కచిక్కిన మీదట నిరుపయోగస్థితికి వచ్చి అవి వధకు గురి యగుచున్నవి. దీనివల్ల గోవులను రక్షించే బదులు భక్షింప చేస్తున్నామని చెప్పక తప్పదు. గోవులు మన దొడ్లలో ఏదో పుట్టుచున్నవి, పెరుగుచున్నవి, అంటే చాలదు. వాటిని బాగుగ సంరక్షించుకునే ఆశయము కూడ మనలో వుండాలి. కొంతమంది వాస్తవముగా గోవులను పూజించడము చూస్తున్నాము. అలాంటి పూజ్యభావము మానవజాతి కంతటికి కలుగ జేయాలి. ఈ బిల్లులో ప్రధాన ఘట్టముగా గోవధను పేర్కొని ఉన్నారు. దీనితోబాటు గోరక్షణ సంగతి కూడా చేర్చితే గాని మన కర్తవ్యము, మన ఆశయము పూర్తి కానేరదు. అందువల్ల ఈ బిల్లును Select Committee కి వంపించి, సెలెక్టు కమిటీ మన అభిప్రాయములు అన్నీ కూడ

చర్చింపచేసి, గోరక్షణకు, గోవధకు చెందిన ఒక సమగ్రమైన బిల్లు తెస్తే బాగా ఉంటుందని మనవి చేస్తున్నాను ప్రభుత్వములో wild life preservation కొరకు ఒక బిల్లు యున్నది. ఎక్కడో పెరిగే అడవి జంతువుల preservation కొరకు ప్రభుత్వము బిల్లును తెస్తున్నప్పుడు, మానవ జాతిని అన్ని విధముల పోషించే యీ గోవుల రక్షణకొరకు బిల్లు ఎందుకు వుండకూడదు అని అడుగుతున్నాను. గోవధ కాకుండా బిల్లు తెచ్చినప్పుడు గో సంరక్షణకు కూడ అవసరము కాబట్టి యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించి ఈ రెండు ఆశయములు సిద్ధించేటట్లుగా ఒక సమగ్రమైన బిల్లును తేగలందులకు ప్రభుత్వాన్ని కోరుతూ విరమిస్తున్నాను.

*శ్రీ షేక్ మౌలానా సాహెబు (ఉదయగిరి) :—ఉపాధ్యక్షా, ఈ నాడు మిత్రుడు పాతా వెంకట సుబ్బయ్యగారు గోవధ నిషేధమును గురించి అనధికార బిల్లును తెచ్చినందులకు వారిని నేను అభినందిస్తున్నాను. ఎందుకంటే గోమాంసమును భక్షించేవారు అనేకమంది ఏ కలరా వ్యాధికో, మరే యితర వ్యాధికో గురియై చనిపోవడము మనము చూస్తున్నాము దీనివల్ల వారి ఆయుః ప్రమాణము కూడ తగ్గిపోయినట్లువుతున్నది. గోమాంసమును బక్షించడము లో వారి యొక్క ఆయుః ప్రమాణము పెంపొందించుకొనటానికనో లేక వారికి ఆరోగ్యము చక్కజేసుకొనటానికేనో, తోడ్పడుతుందనో, వారు యీ మాంసమునకు పాల్పడుతున్నారు. అయితే యీ బిల్లు యొక్క ఉద్దేశ్యము అసలు ఒదికాదేమోనని నాకు అనుమానము వచ్చి, నేను కొన్ని విషయాలు చెప్పదలుచుకుని మాట్లాడుతున్నాను. ఇది మనరాష్ట్రమునకు సంబంధించిన విషయము కాదు అది మొత్తము మీద మన దేశమునకు, ప్రపంచమునకంతటికీ కూడ సంబంధించిన విషయము. ఎందువల్లనంటే యిందులో ఉన్న మర్మములు ఆ విధముగా ఉన్నవి. గోవును కేవలము ఒక మాతృ దృష్టితో యీ వ్యవహారము నడిపించవలసియున్నది. ఈ బిల్లు విషయములో యీ నాటి ఉపన్యాసాలు చూస్తే, యిది ఏదో సోదరుల ప్రోద్బలముతో చేస్తున్నట్లు కనబడుతున్నది కాని నిజముగా చూస్తే మానవజాతి అనిపించుకునే, ఏ దయ దాక్షిణ్యములు కాని మనుష్యులు యీనాడు యీ మృగజాతిమీద యింత లావు ప్రేమను కురిపిస్తున్నారని వారందరిని నేను అభినందిచాల్సిందే. అయితే యిది కేవలము గోవధ చేసేవారికా, చేయించేవారికా అని నాకు సందేహాముగా ఉన్నది. ఈ వధ అనేది ఎట్లాజరుగుతున్నదో గుర్తించాలి. గోవులు మన యిళ్ళలో పుట్టుచున్నవి, పెరుగుచున్నవి. పెరిగినంత కాలము మనలను, మబిడ్డలను బాగుగపోషిస్తున్నవి. చివరకు అవి బక్క చిక్కినప్పుడు, వీటిని మన చేతుల మీద మనమే వాటిని వధ చేయమని అప్పజెప్పుడుతున్నాము. గోవులు పెరిగినన్నాళ్ళు వాటిచేత కష్టము చేయించుకుని, వాటివల్ల పోషించబడుచున్నాము వాటివల్ల పుట్టిన కోడె దూడలచేత పొలములు దున్నించుకొని, పంటలు పండించుకొని బ్రతుకుచున్నాము. ఇందులోని వాస్తవిక పరిస్థితిని గుర్తించాలని మనవి చేస్తున్నాను. కష్టము చేయించుకుని, పోషింపబడి, మనము వీటిని మన చేతులారా వధకు అప్ప జెప్పడము లేదా ? అది మన యింటిముందర ఎందుకు చావాలి, అది ఎక్కడో చచ్చి గాని వధ చేయబడీ-ని ఉంటే, అది మనము చూడముగదా అని, దానిని మనయింటివద్దనుంచి తరిమివేస్తున్నాము. వధ చేసేవాడు ఆ గోవువల్ల ప్రయోజనము పొందుతాడు, పోషించబడతాడు, ఏదో తన వద్దకు వచ్చినదని వధచేయడము జరుగుతున్నది. కాబట్టి యిందులో దోషి

వధకు యిచ్చిన వాడా, వధచేసినవాడా, మొదటి తప్పు ఎవ్వరిదో గుర్తించాలి. మాంసమును అమ్ముకుని జీవించే పేదవాడి మీద యింత పెద్ద తప్పు మోపడము, యింత పెద్ద శిక్షకు గురి చేయడము న్యాయముకాదు. అమ్ముకోని జీవించే పేదవాడు అతడు, వధ చెయ్యుమని గోవును తీసుకొని వెళ్ళిన వధశాలలో అమ్మివేసిన వాడు వేరు. మొదటినుంచి లాభమును, ప్రయోజనమును పొందినవాడు, యితను గనుక యీ తప్పుగాని, శిక్షగాని అనుభవింప చేయువలసింది, గోవును వధశాలకు పంపినవాడు అని గుర్తించాలి. కాబట్టి యీ శిక్ష గోవును వధశాలకు పంపినవాడి మీద వేసి అనుభవింప జేయాలిగాని ఆ పేదవాడిమీద వేయడము న్యాయముకాదు. అయినను గోవును వధచేసిన తరువాత, దాని శరీరములో ఉండే మురికి కంటే, దాని చర్మమును ఉపయోగించడము, గోవును వధచేస్తేనేగాని రాదు. ఈ శిక్ష అనుభవింప జేయవలసిన వారు మూడు నాలుగు భాగములగాని విభజించాల్సి ఉన్నది. మొదటివాడు గోవువల్ల పోషింపబడి వధశాలకుఅప్పజెప్పినవాడు. రెండవది దాని చర్మమును అమ్ముకునిగాని ఉపయోగించేవాడు కాని. మూడవది గోవు శరీరములోని మలమూత్రములు పనికిరాక పోయినను, అది ఆఖరకు చండాలపు కంపు కొట్టేదానినుంచి మన పిల్లలకు వాడే గోరోజనము తయారు జేసేవాడు. ఈ గోరోజనము ఎట్లావస్తుంది? దానికి ఎన్నో సమస్యలు ఉన్నవి. ఈ వస్తువుతో ప్రతిమానవ జాతికి కూడ అవసరమే. ప్రతిరైతుకు కూడ అవసరమే. అది ఆ రైతు యింటిముందర పడి ఉంటుంది. అంతే కాకుండా ప్రపంచములో ఉన్నకోట్ల కొద్దీ ఉన్న జీవరాసులలో ఎంతో పుణ్యము చేసుకుంటేగాని, జన్మరాహిత్యమైతేగాని ఈ గోవు జన్మమునకు రావడముకాదని, మన చరిత్రలు శాస్త్రములు చెబుతున్నవి. ఏ జీవము అయినా అంతేనని చెబుతున్న అలాంటప్పుడు ఆ ఐక్యము కావాలంటే, జబ్బుతో కృశించి మేతలేక తన్నుకొని చచ్చేదానికంటే ఒక్కసారిగా, ఆ గోవుకు తెలియకుండా దానిప్రాణము పోతున్నది. అటువంటి గోవు ఐక్యము పొంది అయిన నరజన్మమునకు వస్తున్నది.

మన దేవాలయములలో నంది అనే పేరుతో ఎద్దును విగ్రహాముగా పెట్టి పూజిస్తున్నాము. దానికి మనము బసవ దేవుడు అని చెబుతున్నాము. ఈ ఎద్దు దేవుడు మనలో ఎంతమందికి కావాలి? దానిలో ఉండే ఆంతర్యముకూడ చాలా ముఖ్యమైనదే. ఈ ఎద్దుకూడ గోవులకు పుట్టినదే. అది ఎక్కడెక్కడో మేతమేసి ఆకలి తీర్చుకొంటున్నది. అదికూడ ఆవులను దాటి కోడెలను పుట్టిస్తున్నది. ఆ కోడెలు పెరిగి మన పొలములు దున్నితే, మనము పంట పండించుకుని బ్రతుకుచున్నాము. అదికూడ నిద్రించుచున్నది. పైగా దానివల్ల పరోపకారమనేది మనము చూస్తున్నాము. దాని మెడమీద కాడిపెట్టితే, అది మోసుకుని పొలము పోయి పొలము దున్నుచున్నది. అది సమస్త జీవరాసులకు ఆహారమును అందజేస్తున్నది. నిజంగా అన్నం పెట్టేవాడు దేవుడు. అటువంటి దేవుడు చేసే పనిని ఈ ఎద్దుచేస్తున్నది కాబట్టి బసవ దేవుడనే నామము దీనికి పెట్టినాము. దానిని చూచి అయినా బుద్ధితెచ్చుకోమని ఆ నందిని దేవస్థానంలో పెట్టాము. బిల్లు చేసేటప్పుడు ఇన్ని రకాలుగా ఆలోచన చేయవలసి ఉన్నది ఇది ఇండియా ప్రభుత్వం చేయవలసిన పనిగాని రాష్ట్ర ప్రభుత్వం చేయడం సమంజసం కాదేమో ననుకొంటాను. దీర్ఘదృష్టితో ప్రపంచంలో ఉండేటటువంటి అన్ని రాజ్యాలతో వ్యవహరించి చేసే విషయం. కేవలం minority లలోనే ఈ గోవధ అంతా చేస్తున్నారు. వాళ్ళే

పాతకులు, వాళ్ళే దీని కంతకు కారకులు అని చెప్పడం తగదు. దానికి ఎవరు కూడా సహించరు. మొత్తం మీద వెంకటసుబ్బయ్యగారు తెచ్చిన బిల్లుతో నేను ఏకీభవిస్తున్నాను. ఇది మైనారటీల యొక్క క్షేమానికని మాత్రం మనవి చేస్తూ ఈ అవకాశం ఇచ్చినందులకు నేను అధ్యక్షుల వారికి హృదయపూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

*Srmti. Masuma Begum (Pathergatti) :* Mr. Speaker Sir, the mover of this Bill wants this Bill to berferred to the Select Committee I find there is no point in arguing the provisions of the Bill when it is going to be referred to a Select Commmitee. It is only creatnig ill-feeling and I suggest that we accept that the Bill be referred to a Select Committee.

*Mr. Deputy Speaker* :—It is only on the motion to refer the Bill to the Select Committee that all this discussion is going on. Reference to certain provisions in the Bill is not prohibited.

శ్రీ అల్లూరి బాపినీడు (కొవ్వూరు—జనరల్):—ఉపాధ్యక్షా, గోవధ నిషేధం అనే ఉద్యమం ఈబిల్లు రాకుండానే కొంతమంది హిందూ సబ్ హెడ్స్ అనేటటువంటివారు ఈ ఉద్యమాన్ని మనదేశంలోకి తీసుకువచ్చారు. ఇది ఏ మతానికి సంబంధించిలేదు. జీవహింస అనేది ప్రతి మానవునికి సంబంధించినదే. అందువల్లనే మన ప్రధాన మంత్రిగారుకూడా గోవధ నిషేధం అనేటటువంటిది శాసనపూర్వకంగా మన ఇండియా దేశంలో ఉండటానికి వీలులేదు అనే అభిప్రాయాన్ని ఒకప్పుడు తెలియపరిచారు. మన హిందూ దేశంలో హిందువులే కాకుండా 7 కోట్లు మంది మిగత జాతులవారు ఉన్నారు. 4 కోట్లమంది మహ్మదీయులు ఉన్నారు. అయితే గోమాంస భక్షకులు చాలమంది ఉండవచ్చు. ఉండకపోవచ్చు.

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ :—ఒక్క గోవులేకాదు. She buffaloe కూడాను తెలిపారు. గోవులనే పెద్దగాచేసి వ్యవహారం చేయడం మంచిదికాదు.

శ్రీ అల్లూరి బాపినీడు:—ఏ మతానికి చెందిన మానవుడైనా పాలిచ్చే ఆవును కోసుకు తినడం లేదనే విషయం ప్రతివాళ్ళు గ్రహించవలసిన అవసరం ఉన్నది. ఆదాయాన్ని తెచ్చే పశువు ఏదైనప్పటికి, దున్నపోతు కానీయండి, ఎద్దు కానీయండి, దేనినైనా సరే కోసుకు తినడం లేదు. దాన్ని ఉపయోగిస్తూనే ఉన్నారు. ఇది అధికార పూర్వకంగా ఉండాలా, లేదా అనే విషయంతో నేను ఏకీభవించడం లేదు. అనేక వేల సంవత్సరాలనుంచి నైతికంగా అందరికి సమానంగానే ఉంటూవచ్చినది గాని, క్రైస్తవులు వచ్చినా మహ్మదీయులు వచ్చినా, అధికార పూర్వకంగా మాత్రము ఉండడంలేదు. గోవులను గాని, She-buffaloes ను గాని పాలిచ్చే వాటిని చంపకూడదనే విశ్వాసము వారిలోనే ఉండాలి. ఈ బిల్లు పెట్టి వధ నాపినంత మాత్రాన అది తగ్గుతుందా అనె విషయాన్ని ఆలోచించి నట్లయితే దీనివల్ల మత భావాలను రెచ్చగొట్టడమే

అవుతుంది తప్ప మరేమి కాదు. ఈ బిల్లును ఆధారంగా, మత ప్రచారం విరివిగా జరుగుతున్నదనే విషయం అందరికీ తెలిసినదే. అందుచేత ఈ బిల్లు అధికారపూర్వకంగా ఉండడానికి వీలు లేదు. నైతికంగా ఎవరిమటుకు వారికి వదలివేయవలసిందని చెపుతూ నేను ఈ బిల్లును oppose చేస్తున్నానని మనవి చేస్తున్నాను.

శ్రీ బి. రామారెడ్డి (మైదుకూరు) :—ఉపాధ్యక్షా, మిత్రులు వెంకటసుబ్బయ్యాగారు ప్రవేశపెట్టినట్టి బిల్లు విషయమై మాట్లాడుతూ అనేకమంది మిత్రులు ఆధ్యాత్మికమని, నైతికమని, పారమార్థికమని, భౌతికమని ఏవేవో చెప్పారు. వారు చెప్పినది ఒకటి. మనదేశం వ్యవసాయక దేశం. వ్యవసాయానికి ఉపకరించేటటువంటి ఎద్దులను, వాటిని ఉత్పత్తిచేసే దానికి మాతా ధారము రెండవది తల్లిపాలు ఎక్కువగా లేనందువల్ల ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రంలో ఆవు పాలే ఎక్కువగా వాడుతున్నాము. అందువలన దానిని సంరక్షించుకున్నట్లయితే ఒక విధంగా మానవ జీవితానికి అతికేటట్లుగా ఉంటుందని వారియొక్క Statement of objects లో చెప్పారు. అహింస అన్నారు. అహింసా తత్వం ఎత్తుకుంటే దీనికి దిక్కుతెలియకనే " ఇది దరిలేని సాగరము అహింసయు, హింసయు నిర్ణయింప " అని ఒక పండితుడు అన్నాడు. అలాంటప్పుడు ఇంకా అహింస నిర్ణయంతో మాట్లాడదలచుకొంటే పైన చెప్పినటువంటి వివరాలను బట్టి గోవు మనకు ముఖ్యంగా వ్యవసాయానికి ఆధారభూతమైనది. కాబట్టి దానిని రక్షించడం ప్రధానం అనే ఒక్క మాటతో సరిపోతుంది. ముసలితనమువచ్చి పెద్దవైపోయినవి, బాగా పనికిరాకుండా ఉండే పశువులు కొన్ని ఉన్నాయి. మనం తల్లి తండ్రులను రక్షించడం లేదా అనే పదం తీసుకొచ్చి ఇక్కడ అడ్డం వేస్తున్నారు. నా బిడ్డ నా భార్య, నా కుమారులు, నా సంసారం అనే బాధ్యత ఒకటి కల్పించుకొంటున్నారు. వారిని పోషించవలసిన బాధ్యత మనయందు ఉన్నది అని అనుకొనేటటువంటి బిడ్డలు ఉండినప్పటికే దిక్కు లేకుండా అనేక మంది తల్లి తండ్రులు మంచాలపైన చచ్చిపోతూ ఉండడం మనం చూస్తూనే ఉన్నాము. ఇటువంటప్పుడు కేవలం ముసలివి అయిపోయి శక్తి ఉడిగిపోయిన పశువులను చూచేవారు ఎవరు లేరుకదా ! అలాంటప్పుడు కేవలం ఆధ్యాత్మిక చింతచేత వీటిని కూడా నిషిద్ధంచేసి, చిత్రవధచేసి చంపేదానికంటే తక్షణమే ముక్తిమార్గాన్ని ప్రసాదించితే బాగుంటుందేమో ముసలి, ముతకగా ఉండే పశువులన్నీ రక్షణ లేకుండా వీధుల వెంబడి తిరుగుతూ వీళ్ళ చేత వాళ్ళచేత కాళ్ళు, చేతులు విరుగ గొట్టించుకొని చచ్చే దానికంటే కొన్ని మినహాయింపులలో గోవధ నిషేధిస్తే బాగుంటుంది. గో సంరక్షణవారు చెప్పినట్లుగా ఈ రెంటికి కూడా ముఖ్యంగా ఉంటుందని, దీనిని ప్రజాభిప్రాయం కొరకు Select Committee కి పంపడం అవసరం అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ నేను సెలవు తీసుకొంటున్నాను.

మిస్టర్ డిప్యూటీస్పీకర్ :—ఇంక ఈ చర్చ అనవసరం. శ్రీ డి. సంజీవయ్యా, శ్రీ పి. వెంకటసుబ్బయ్యా, శ్రీ బసిరెడ్డి, శ్రీ అయ్యపురెడ్డి, శ్రీ మహామ్మద్ రహామతుల్లాసాహేబ్, శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యా, శ్రీరామకృష్ణరాజు, శ్రీ బి. రత్నసభాపతి, శ్రీ పి. సుందరయ్యా, శ్రీమతి అమ్మన్నరాజా, శ్రీమతి డి. లక్ష్మీకాంతమ్మ, శ్రీ ముత్యాలరావు, శ్రీ టి. రంగారెడ్డిగారు, శ్రీ చొక్కారావుగార్లు ఈ 15గురు మెంబర్లతో గూడిన Select committee పంపించవలెననే విషయం ఇప్పుడు ఓటుకు పెట్టాల్సి వుంటుంది.

శ్రీ పి. సుందరయ్య:—నా పేరు అందులో సూచించడం జరిగింది.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్:—అక్కడ అనేక సలహాలు చేయవచ్చు, అటూ ఇటూ.

శ్రీ పి. సుందరయ్య:—ఇన్ని కమిటీలలో వుండి పనిచేయడం నాకు చాలా కష్టమైన పని. నామకః ఉండడంకన్న.......... .

మిస్టర్ డిప్యూటీ స్పీకర్:—మీవాళ్ళలో ఎవరో ఒకరి పేరు ఇవ్వండి.

శ్రీ పి. సుందరయ్య:—శ్రీ అన్నపూర్ణాలు పేరు నాకుగాను వుపసంహరించండి.

*Sri P. Anthony Reddi ( Anantapoor) :* It is better if one or two more members are included in the Select Committee.

*Mr. Deputy Speaker* : Rule 108 of the Assembly Rules reads thus : "Constitution of Select Committee : No Select Commmittee on a Bill shall ordinarily consist of more than 15 members; and member in charge of the Bill shall be a member thereof."

*Sri P. Anthony Reddy:* Sir, it is better to delete two names and include two names, preferably Mohammadans.

*Sri K. Venkata Rao* : Selection of members on Community basis is not just. I oppose it. We are all Indians. I never thought Mr. Anthony Reddi will go to that extent.

*Mr. Deputy Speaker* : The question is :

That the Cows and She-Buffaloes Slaughter Prohibition Bill, 1956 (L. A. Bill No. 7 of 1956) be referred to a Select Committee consisting of the following members :—

1. Sri. D. Sanjivayya. (Chairman).
2. ,, P. Venkata Subbayya.
3. ,, E. Ayyapu Reddi.
4. ,, Mohammad Rahimtulla.
5. ,, T. G. Thimmayya Setti.
6. ,, Vavilala Gopalakrishnayya.
7. ,, R. B. Ramarkrishna Raju.
8. ,, B. Ratnasabhapathi.
9. ,, Amrutlal.
10. Srimati C. Ammanna Raja.
11. ,, Lakshmikantamma.
12. Sri Muthyalrao.
13. ,, P. Ranga Reddi.
14. ,, J. Chikka Rao.
15. ,, Mir Ahmad Ali Khan.

The motion was adopted.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ .—కాబట్టి దానిని సెలక్టు కమిటీకి పంపాలి డి. సంజీవయ్యగారు అధ్యక్షులుగా వుంటారు. వారికి కావలసినంత Time తీసుకొని Report పంపవచ్చు.

## The Hyderabad Tenancy and Agricultural Lands (Andhra Pradesh Amendment) Bill, 1956.

*Sri Vavilala Gopalakrishnayya :* Mr. Deputy Speaker, Sir, I beg leave to introduce the Hyderabad Tenancy and Agricultural Lands (Andhra Pradesh Amendment) Bill, 1956.

*Mr. Speaker* : Motion moved :

"That leave be granted to introduce the Hyderabad Tenancy and Agircultural Lands (Andhra Pradesh Amendment) Bill, 1956."

ఆర్థిక మంత్రి (శ్రీ కె. వెంకటరావు):—అసలు ఈ బిల్లును ప్రవేశపెట్టకూడదని నేను ప్రభుత్వం తరఫున దీనిని వ్యతిరేకిస్తున్నాను.

మిస్టర్ డిప్యూటీస్పీకర్ :—ఈ బిల్లుయొక్క అవసరమును గూర్చి వావిలాలగోపాలకృష్ణయ్య గారు సంక్షిప్తంగా చెప్పవలెనని కోరుతున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి):—ఉపాధ్యక్షా, మనం ఆంధ్ర రాష్ట్రం నుంచి హైదరాబాదు రాష్ట్రంలోనికి వచ్చాము. హైదరాబాదు రాష్ట్రములో ఒక విధమైన భూ సంస్కరణాల చట్టము వున్నది. ఉన్నవాటిల్లోకల్లా అత్యున్నత స్థాయిలో నున్నదని (నాలో ఎన్ని లోపాలున్నప్పటికీ) ఇతర రాష్ట్రాలలో ఉన్నటువంటి చట్టాలకన్నా తెలంగాణాలో జరిగిన రైతు ఉద్యమ ఫలితంగా ఇది అత్యున్నత స్థాయిలో నున్నదనుకోవడం జరుగుతుంది. అవి పూర్తిగా సంతృప్తికరంగా లేవనే మాట మన మందరంకూడా ఒప్పుకొంటాము. ఇప్పుడున్న వాటిల్లో అదీ ప్రస్తుతం తాత్కాలికంగా ఉపయోగపడుతున్నది గనుక—ఇదివరకు కాళేశ్వరరావు పంతులుగారు కూడా రాష్ట్రం మొత్తానికి దానినే సమన్వయం చేసేటట్లు చేయవలసినదని సెలవిచ్చారు. రాష్ట్రం మొత్తంలో ఈ రెండింటిని సమన్వయ పరచాలనే అభిప్రాయం వున్నది. మనం మద్రాసు రాష్ట్రంనుంచి బయటకు వచ్చాము. ఇక్కడివారు హైదరాబాదునుంచి బయట పడ్డారు. ఈ రెండు కూడా కలవడం అవసరమైనది. ఇది కాకుండా Planning Committee వారు ఉదహరించిన విషయాలలో కూడా అన్యాయం జరిగింది. ( Planning Committee వారు వారి plan లో ఈ క్రింది విధంగా చెప్పారు.

"Family holding has been defined by a Committee of land reform panel as area of land which yields a gross average income of Rs. 1600/- per annum or net annual income including remuneration for family labour of Rs. 200/- and is not less than a plough unit."

దాంట్లో ఇట్లాంటి family units అన్నీ కూడా నిర్ణయించి ceilings కూడా ఏర్పరచి, ఒక పద్ధతిలో కొంత ప్రయత్నం జరిగింది. ఇంతవరకు ప్రయోజనం పొందినటువంటి లెక్కలు వేసినట్లయితే తెలంగాణా ప్రాంతంలో ఉన్నటువంటి వాటిల్లో 25 ఎకరాల వరకూ ఉన్నవారు..........

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ :—వారు ఇంకా సరిచేసుకుంటున్నారు వారిదగ్గర ఇంకా పూర్తి infarmation లేదు. మీరు ఎక్కడో సేకరించారు.

శ్రీ కె. వెంకటరావు :—Merits of the Bill లోకి వెళ్ళడం కాదు.

మిస్టర్డెప్యూటీస్పీకర్ :—సంక్షిప్తంగా చెప్పండి. ఇప్పుడున్న అవసరమేమో, అనవసరమేమో చెప్పండి. దానికి ఇంతపెద్ద ఉపన్యాసం అక్కడ లేదు.

Rule 102 of the Assembly Rules says : "If a motion for leave to introduce a Bill is opposed, the Speaker, after permitting, if he thinks fit, a brief explanatory statement from the member who moves and from the member who opposes the motion may, without further debate, put the question."

శ్రీ వావిలాలగోపాల కృష్ణయ్య :—నేను అదంతా ఎందుకు చెబుతున్నానంటే అది Planning Committee చెప్పింది. ఈ బిల్లును అమలులోనికి పెట్టడానికి ఇదివరకు వున్న తెలంగాణా ప్రాంతంలో ఏ బిల్లు అనువర్తిస్తుందో అనేది దాంట్లోకూడ ఒకే క్లాజు ఉన్నది.

For the words "Andhra" the Bill seeks to substitute the words "Andhra Pradesh"

చాలా చిన్న amendment వున్నది.

మిస్టర్ డెప్యూటీ స్పీకర్:— ఇక కూర్చోండి అర్థమైంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—దీనివల్ల ఉపయోగమేమిటో చెప్పాలి. ఎవరికి ఉపయోగ పడుతుందో చెప్పవద్దా ?

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ :—చేస్తే అందరకూ ఉపయోగ పడుతుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—కొద్దిగా facts చెబుతాను. ఎంతవరకూ ఉపయోగపడినదీ, ఇక ఎంతవరకూ ఉపయోగపడుతుందీ చెబుతాను.

మిస్టర్ డెప్యూటీ స్పీకర్ : సంక్షిప్తంగా ఉన్నదని చెబుతున్నారు కనుక—

శ్రీ కె. వెంకటరావు :—నేను భూ సంస్కరణలంటె చాలా ఇష్టమైన వాడననే సంగతి గోపాల కృష్ణయ్యగారికి తెలుసు. కాని ఇటువంటి పెద్ద భూ సంస్కరణల విషయంలో ఒక్క

Simple clause shall apply to Andhra Pradesh అని తీసుకురావడం అనేది నేను ప్రపంచంలో ఎక్కడా ఎరుగను. కావాలంటే బిల్లును study చేసి, consider చేసి House లో pass చేయండి. ఈ clauses చేస్తారో; ఇంకా పెద్దవి చేస్తారో చేయవచ్చును. ఇది శాసనసభ ముందుకు వచ్చేటటువంటి విషయం.

భూసంస్కరణల విషయంలో రెండవ పంచవర్ష ప్రణాళికలో చెప్పబడినటువంటి పద్ధతిని మనస్సులో పెట్టుకొని, రాష్ట్రానికి ఉన్నటువంటి స్వేచ్ఛను వినియోగించుకొని 3, 4 నెలల లోపున నేను ఈ బిల్లును సభవారి యెదుట పెట్టడానికి యత్నంచేస్తాను. చేస్తానసే వాగ్దానం మాత్రం నేను ఇప్పుడు ఇవ్వగలను. ఇంకొక విషయం కూడా మనవి చేస్తాను ఇంకొక తీర్మానం వస్తోంది. ఈ సందర్భంలోనే దానిని గురించి ఏరకంగా చర్చ జరగాలో కూడా తమ ద్వారానే మనవి చేస్తాను. ప్రస్తుత పరిస్థితులలో ఈ బిల్లుకు సంబంధించినంత వరకు వారు చెప్పినటువంటి పద్ధతిని శాసనసభ ముందు ప్రవేశపెట్టుటకు అనుమతి నివ్వడానికి ప్రభుత్వం వ్యతిరేకిస్తోందని మాత్రం నేను మనవి చేస్తున్నాను.

*Mr. Deputy Speaker* :—Now, the question is :

"That leave be granted to introduce the Hyderabad Tenancy and Agricultural Lands (Andhra Pradesh Amendment) Bill, 1956."

The motion was negatived.

Leave to introduce to Bill was not granted.

## Resolution re : Legislation on Land Reforms.

*Sri B. Sankariah* (*Buchireddipalem*) :–Mr. Deputy Speaker, Sir, I beg to move :

"That this Assembly recommends to the Government to introduce a Bill for land reforms in this Assembly immediatly on the lines of the suggestions of the Planning Commission."

శ్రీ కె. వెంకటరావు :—నేను మీ ద్వారా ఇప్పుడు ఒక విన్నపము చేయదలచు కున్నాను. ఇప్పుడు బిల్లు రూపకంగా పెట్టినదే వారు తీర్మాన రూపకంగా పెట్టినారు. దాని తీర్మానాన్ని పెట్టడంమాట అటా ఉంచి నేను ఒక విషయం మనవి చేస్తున్నాను. 23 నెలల్లో నేను బిల్లును తీసుకునివస్తానని చెప్పాను. కనుక సభ్యులు ఇప్పుడు దీనిమీద మాట్లాడడంలో ఈ బిల్లు ఆంధ్ర రాష్ట్రంలో ఏరకంగా, ఇంతవరకూ ఉన్నపరిస్థితులను బట్టి, హైదరాబాదు రాష్ట్రంలో ఉన్నటువంటి పరిస్థితులను బట్టి సమన్వయంచేసికొని ఏయేరకంగా ముఖ్యమైన ceiling, rent, Transfer, prohibition మున్నగు 3, 4 పెద్ద items కు సంబంధించి positive గా వారి అనుభవాలను బట్టి మాట్లాడితే నేను ఈవేళ debate

వచ్చేసూచన లన్నింటినీ దృష్టిలో పెట్టుకొని రేపు అఖిల భారత ప్రభుత్వంతో discuss చేసేటప్పుడుగాని లేక బిల్లును frame చేసి సభముందుకు తీసుకుని వచ్చేటప్పుడుగాని నేను మనస్సులో పెట్టుకొని పనిచేస్తానని మనవి చేస్తున్నాను. అందువల్ల ideological discussion ను తగ్గించి, practical point తీసుకొని, ఎంతమంది సభ్యులు మాట్లాడినాసరే, ఈరోజు కాకపోతే మరోరోజు తీసుకొని అయినా వారివారి అభిప్రాయాలను సంక్షిప్తంగా ముఖ్యమైన 4, 5 విషయాలు ఆలోచించవలసి యున్నదనే సూచనలు ఇస్తే నేను సభవారికి ఎంతో కృతజ్ఞుడనవుతాను.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—ఇది హైదరాబాదుకు సంబంధించిన బిల్లు కాదు. Planning Commission ఇచ్చిన సూచనలనుబట్టి భూసంస్కరణలు ఎలాచేయ వలసినదీ ఈ తీర్మానము.

శ్రీ మంతిన వెంకటరాజు (బాపట్ల) :—మీరు ఇచ్చిన suggestion తో హైదరాబాదు బిల్లును గూడా దృష్టిలో పెట్టుకొని మాట్లాడమన్నారు. అందువల్ల దానిని గురించి మాట్లాడడానికి విషయాలు చెప్పడానికి ఆబిల్లు లేకపోతే ఇబ్బంది కనుక దానిని supply చేయించి, ప్రస్తుతమునకు ఈ బిల్లును వాయిదా వేసిన బాగుంటుందని మనవి చేస్తున్నాను.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—హైదరాబాదుకు సంబంధించిన భూసంస్కరణల చట్టము అచ్చువేయించి అందరికి పంచిపెట్టితే బాగుంటుంది, అని మంత్రిగారికి సలహా ఇస్తున్నాను.

శ్రీ కె. వెంకటరావు :—పంచిపెట్టేనాటికి సమగ్రముగా చదువు కోడానికి అనుకూలముగా నేను ఇప్పుడు సలహాలను అడిగాను. Immediately అంటే నేను తీసుకొన్న అర్థము 3, 4 నెలలు అన్న మాట. అంతకంటె త్వరగా వస్తుందని శంకరయ్యగారు కూడా అనుకొని ఉండరు. Planning Commission ఇచ్చిన సూచనల ప్రకారము ఏరకంగా ఏ ముఖ్య అంశాల మీద ఈబిల్లు ప్రవేశపెట్టడానికి బాగుంటుందో మాట్లాడే సభ్యులు సలహాలు ఇవ్వ వలసినదిగా కోరుతున్నాను.

శ్రీ బి. శంకరయ్య :—అధ్యక్షా! ఈ తీర్మానమును ప్రవేశపెట్టేటటువంటి ఉద్దేశ్యము వెంకటరావుగారు చెప్పినట్లు ఈ భూసంస్కరణల బిల్లును త్వరగా pass చేసి మరల అమలులోకి రావడానికి దానిని శాసన సభముందుకు తెచ్చాము. ఈ రోజున ఆంధ్రలోను తెలంగాణాలోను ఉండే భూసమస్యలగురించి, ఏవిధమైన సంస్కరణలు తీసుకొనివస్తే నిజముగ ఈ తీర్మానం నెరవేరుతుందో అటువంటి సూచనలు చేయడానికి ఈ తీర్మానము సభముందుకు తీసుకొని వచ్చాము. అయితే దానికి మొట్టమొదటవున్న బిల్లును వ్యతిరేకించిన వెంకటరావు గారు ఈ విషయములో సూచనలు చేయమని చెప్పారు. ప్లానింగు కమీషన్ యిచ్చిన సూచనల ప్రకారము మన రాష్ట్రములో భూసంస్కరణ ప్రవేశ పెట్టాలనివుంది. దేశము అంతటికి సంబం ధించిన అన్ని సమస్యలను పరిశీలించి ఇచ్చిన సూచనలు మన అందరి ముందు ఉన్నవి. మన

State లో నేకాక అన్ని రాష్ట్రాల్లోను ప్రభుత్వాలముందు ఉన్నవి. ప్రజలముందు కూడా ఈ సూచనలు ఉన్నవి. Planning Commisssion కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడి ఆదేశాలు ఇవ్వకముందే All India Congress తరపున కుమారప్ప కమిటీని నియమించడము జరిగింది. వారిచ్చిన సూచనలకు అనుగుణ్యంగానే Planning Committee వారికి సూచనలు ఇవ్వబడ్డాయి. నెహ్రూగారి అధ్యక్షత క్రింద ఏర్పడిన Planning Commission ఇచ్చిన సూచనలు కూడా ఇదే విధముగా ఉన్నాయి. అటువంటప్పుడు ఈ తీర్మానాన్ని ఎవ్వరూ వ్యతిరేకించరని అనుకొంటాను. ఇప్పుడు ఈ తీర్మానాన్ని అనుకూలిస్తారా, వ్యతిరేకిస్తారా అన్నదికాదు. అసలు ఏ పద్ధతులలో భూసంస్కరణలు ఆంధ్రలో తీసుకొనివస్తే అవి ప్రజలకు ఉపయోగపడుతాయో ఈ విషయములో ప్రభుత్వం వైఖరి ఏవిధముగావుందో పరిశీలించడానికి, ఇవాళ అందరు సభ్యులు తమతమ అభిప్రాయాలను వ్యక్తము చేస్తే బాగుంటుంది అనే ఉద్దేశ్యముతో తీసుకొని వచ్చాము. మంత్రులు వివిధచోట్ల మాట్లాడే విషయాలు వాటిలో కొన్ని మార్పులు తెలుసుకొని, ఈ బిల్లును తీసుకొనివచ్చి యివాళ రాష్ట్రములో పరిస్థితులు ఎట్లావున్నవో తెలుసుకొనవలెనన్న ఉద్దేశ్యముతోనే ఈబిల్లు ప్రవేశ పెట్టడము జరిగింది. ఈ సంస్కరణలు మొదటి పంచవర్ష ప్రణాళికలో సూచించారు రెండవ పంచవర్ష ప్రణాళికలో కూడా దానిని సూచించవలసి వచ్చింది. దీనివలన చాలా కాలముగా ఆర్థికముగాను, సాంఘికముగాను అన్నివిధాల పేదప్రజానీకానికి గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో తగిన స్థానము కల్పించాలి. గరిష్ట పరిమితికి మించిన భూములను భూవసతిలేని కూలీలకు, భూములనుంచి తొలగించబడిన, దుస్థితిపాలైన కౌలుదార్లకు, పేదవారయిన రైతులకు ప్రాధాన్యము ఇవ్వబడాలి. ఇదే Planning Commission ఇచ్చినసూచనల ముఖ్య సారాంశము. భూస్వాముల వద్దవున్న అదనపు భూములను సేకరించి, వారికి గరిష్ట పరిమితి నిర్ణయించి మిగిలిన వాటిని తీసుకోవడము. గరిష్ట పరిమితికి కూడా కొన్ని సూచనలు చేశారు. 3,600 ఆదాయముగాని, 3,600 ఫలసాయంగాని 4,800 ఆదాయముగాని గరిష్ట పరిమితంగా పెట్టమన్నారు. దేశములో చాలకాలముగా దుస్థితిపాలైన వారి ఆర్థికస్థితిని బాగుచేయాలి. ఆ భూములను విరికిపంచి పెట్టాలి. అందువల్ల వాళ్లకు భూములు లభించేదానికి Planning Commission తెచ్చిన సంస్కరణలోని సారాంశము యిది. గాంధీగారు 1947 లో 'దున్నేవానిదే భూమి అన్నారు. అది రాష్ట్ర ప్రభుత్వ పరిస్థితికి వచ్చేటప్పటికి ఒకప్పుడు మాజీ మంత్రిగావున్న శ్రీ చంద్రమౌళిగారు దున్నేవాళ్లకు భూమిఅంటే పశువులకా, దున్నపోతులకా అన్నారు. ఇదే విధముగా శ్రీ గోపాలరెడ్డిగారు Planning Commission వారు ఇచ్చిన సూచనల ప్రకారమయితే మన ఆంధ్ర దేశములో పంచేదానికి 3, 4 లక్షలకంటే ఎక్కువ ఉండదన్నారు. దేశములో ఇతర పరిశ్రమాధిపతులు, కోటీశ్వరులు ఉండగా ఈ భూస్వాములు పెద్ద కార్ఖానాలుగాని, పెద్ద పరిశ్రమలుగాని పెట్టకుండాపోయే పరిస్థితి వస్తుంది. Planning Commission ఇచ్చిన సూచన ప్రకారం గరిష్ట పరిమితికి మించిన భూములను పేదప్రజానీకానికి అందచేయడానికి ఇస్తున్నామని చెప్పి, ఈ విధముగా వ్యతిరేకించారు. అదే విధముగా కళా వెంకటరావుగారు కూడా ఈమధ్య రేడియోలో ప్రసంగిస్తూ ఈ భూసంస్కరణల గురించి వివరిస్తూ, మక్తాల విషయములోను, శిస్తుల విషయములోను తమతమ భేదాలు తగ్గించడము సారాంశముగా చెప్పారు. ఆంధ్ర దేశములో, గ్రామాలలో ఈరోజు భూమిలేక చాలామంది

అవస్థ పడుతున్నారు. గ్రామాలలో నూటికి 84 మంది వ్యవసాయంమీద ఆధారపడి నివసిస్తున్నారు. వాటిలో 83 మంది వ్యవసాయం మీద ఆధారపడి ఉన్నారు. ఈ వ్యవసాయమే జీవనాధారముగా ఉండేవారిలో సగము మందికి పనిలేక, చాలినంత చేసుకొనుటకు భూమిలేక అవస్థలు పడుతూ పస్తులు ఉంటున్నారు. సంవత్సరానికి 3, 4 మాసాలు పస్తులతోనే గడుపుతున్నారు. అందుచేతనే భూసంస్కరణల ముఖ్యోద్దేశ్యము అందరకు భూమి అందచేయాలని దేశములో Planning Commission సూచనలు నిర్దిష్టముగా వచ్చిన తరువాత కూడా మన ఆంధ్ర దేశములో ఈ భూసంస్కరణలు అమలు చేయలేదు. కమిటీ ఆఫీసరు దానికి వ్యతిరేకంగా కూడా వ్రాశారు. Planning Commission యొక్క ముఖ్యసూత్రాలను వ్యతిరేకించే వారిలోకాదు ఇది మాటలతోనే మనకు ఈ భూసంస్కరణ కాదు. ఇంతవరకు మొదటి పంచవర్ష ప్రణాళిక, అయిన 1947, 48 లో జమీందారీల Abolition అయిన తరువాత పంచవర్ష ప్రణాళికలో మనవి చేసింది.

శ్రీ కె. వెంకటరావు :—ఇది అందరకు తెలిసినదే. మంత్రులను అన్నా లాభములేదు. ప్రతి పక్షమువారినన్నా లాభము లేదు వ్యవహారం జరుగుతోంది. చెప్పేటప్పుడు ceiling కావాలా కావలస్తే ఎంత ceiling ఉండాలి. అనే అంశాలు శంకరయ్యగారు చెబితే ఉపయోగిస్తుంది కాని Planning Commission Report చదువగలము లేకపోతే ఇంకొకటి చదువుతాము, అంటే లాభం లేదు. అందుచే definite గా చెప్పండి. ఇంత ceiling పెట్టవచ్చును అని, ఇంత తీసివేయవచ్చునని, ఇది ఇంకొకరికి పంపండి అని మన దేశపరిస్థితులు యిలావున్నా యని discussion నడిపిస్తే బాగుంటుందని ఆ విధముగా నడిపించవలసినదని వారిని ప్రత్యేకముగా కోరుతున్నాను.

శ్రీ బి. శంకరయ్య :—ఇంతకు ముందే చెప్పాను. ఈ మధ్యనే వెంకటరావుగారు రేడియోలో ప్రసంగిస్తూ యీ ceiling పెట్టి ఈ భూములను పేదలకు పంచుతాము అని కాకుండా అసలు దేశములోవున్న అమరకపు తరతమ భేదాలను తొలగిస్తామని చెప్పటము యివాళ సూచనలు యివ్వమనడము దానికి హర్షించవలసిన విషయమే. ప్రస్తుతం ఇంతవరిమితి పెట్టాలనే విషయములో యిపుడు ప్రత్యేకముగా చెప్పవలసిన విషయం అవసరం లేదు. Planning Commission ఇదివరకే చెప్పి వుంది. ఆంధ్ర దేశములో ఆ మేరకన్నా తక్షణం అమలు జరగాలి. ఇప్పుడు ఏ పరిస్థితులు పాల్పడ్డాయో పోయిన అసెంబ్లీ సమావేశములో చెప్పినాము. చాలామంది భూములు ఇతరుల పేర transfer చేస్తున్నారు. అమ్ముకుంటున్నారు. పోయినదానిలో వెంకటరావుగారు ఒక సంవత్సరమున్నారు. ఇపుడు 3, 4 అంటున్నారు 3, 4 నెలలలో చేయవలసిన పని ఏమిటి ఈ రోజున వున్న అమ్మకాలను గాని పరాధీనం చేసిన వాటిని గాని planning commission చెప్పి నటువంటి 3,600 మేరకు గాని 4,800 మేరకు ఫలసాయముగా లెక్క కట్టి చేయవలెను. హైదరాబాదు రాష్ట్రములో దానికి లెక్కలు సేకరించారు. 20 ఎకరాలు పరిమితి పెట్టండి లేక 25 ఎకరాలు పెట్టండి. ఇంతకు పైనున్న భూములకు ఈరోజున మక్తాలను లేకుండా యినామీ transfer పట్టాలు ఇస్తూ ఇతరుల పేర transfer

చేస్తూ వున్నవాటిని వెంటనే నిషేధించడానికి భూములనుంచి తొలగించేదాన్ని ఆపు చేయానికి ఇవాళ చర్య తీసుకొనకుంటే, వాళ్ళు మూడు నెలలు పెట్టినప్పటికి యీ రోజుకే, యిప్పటికే నెల్లూరు జిల్లాలో, మన ఆంధ్రరాష్ట్రములో భూస్వాములు ఎక్కువగా వున్న జిల్లాలో జాగ్రత్త పడుతున్నారు.

ఆంధ్రరాష్ట్రంలో పెద్ద భూస్వాములు ఉంటూ బాగా ఆదాయం వచ్చే డెల్టా జిల్లా అనుకునే నెల్లూరువంటి జిల్లాలో చాలామంది భూస్వాములు 30 ఎకరాలుకన్న ఎక్కువ భూమి తమ పేర లేకుండా చేసుకొని ఇంట్లోవున్న వారందరి పేర కూడా అదే విధంగా భూమిని పెట్టి మిగిలిన భూమిని అమ్ముకుంటున్నారు, ఈ రోజున మూడు నెలలలో భూ సంస్కరణలు తీసుకు వస్తామని శాసనసభలో ప్రకటించిన తరువాత ఇంకా త్వరగా అమ్ముకుంటారు. హైదరాబాదులో ఏమి జరుగుతోంది? వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ప్లానింగు కమిషనువారి సూచనల ప్రకారం సేవింగు పెట్టాలని చెప్పారు. అది అభివృద్ధికరంగానే ఉన్నది. కాని ఆచరణలో ఏమి జరుగుతోంది: భూస్వాములు భూమి అమ్ముకోడానికి ఆటంకం లేకుండా ఉన్నది. ఇతరుల పేర పట్టాలు యివ్వడానికి ఆటంకం లేకుండా ఉన్నది. అనేక మందిని భూమినుంచి తొలగిస్తున్నారు. పేదలకు భూములు రావాలనే ఉద్దేశంతోనే సంస్కరణలు చేయడానికి నిశ్చయిస్తే అన్నివిధముల్లైన అమ్మకాలను గాని భూములనుంచి తొలగించడానికి, గాని నిర్దుష్టంగా నిషేధిస్తూ తక్షణ చర్యలు ముందు తీసుకోవాలి. అటుతరువాత బిల్లు ప్రవేశపెట్టి, అటు చేయవలెనా ఇటు చేయవలెనా, కొన్ని ఎకరాలు హెచ్చించవలెనా, ఏ విధంగా ఉండాలనే విషయం సాకల్యంగా చర్చించవచ్చును. ఈ విధమైన చర్చలేమీ తీసుకోకుండా వెంకటరావుగారు చెప్పినట్లు బిల్లు తీసుకువస్తే ఆంధ్రదేశంలోని చాలామంది భూస్వాముల దగ్గర వుండే భూమి ప్రభుత్వానికి అందకుండా వుండే పరిస్థితులు రోజురోజుకు ఎక్కువ అవుతున్నాయి. ఎక్కడనుంచిఅయినా రిపోర్టులు తెప్పించమనండి ఏ కలెక్టరుపైనా అడిగి తెప్పించమనండి. ఎంత భూమిని ఇష్టం వచ్చినట్లు అమ్ముకుంటున్నారో దొంగ పట్టాలు ఎన్ని సృష్టిస్తున్నారో తెలిసిన విషయమే.

శ్రీ కె. వెంకటరావు :—ఏడెనిమిది సంవత్సరాల లోపుగా భార్యల పేర కొత్తగా భూములు కొంటే దానివిషయమై ఏమి చేయుసుంటారు?

శ్రీ బి. శంకరయ్య :—ప్లానింగ్ కమిషనువారు ఈ విషయాన్ని కూడా చర్చించారు. గరిష్టపరిమితి అనేది వ్యక్తికి ఉండాలా కుటుంబానికాఅనె విషయం చర్చించారు. చర్చించి, కుటుంబం అంటే భార్యభర్త, పిల్లలు మనమలు అందరూ లెక్కకు వస్తారని అటువంటి కుటుంబానికి గరిష్ట పరిమితి అనేది నిర్ణయించాలి కాని వ్యక్తికి గరిష పరిమితి పెట్టకూడదని చెప్పారు. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు, మన రాష్ట్ర ప్రభుత్వంకూడా, వ్యక్తుల పేర ఎంతభూమి ఉన్నదనే లెక్కలు సేకరిస్తున్నారు. కాని ప్లానింగు కమిషను సూచనల ప్రకారం కుటుంబం మొత్తమును తీసుకుని అందరికి కలిపి ఎంత భూమి ఉన్నదనే లెక్కలను సేకరించుటలేదు. మొన్న బడ్జెటు ఉపన్యాసంలోను గవర్నరు ఉపన్యాసంలోను 1856 లో తెచ్చిన చట్టాలను కూడా భూ సంస్కరణలలో భాగాలుగా చెప్పియున్నారు. పేదప్రజలకు

భూమిని చెందచేయాలనే సూత్రాన్ని ఎంతవరకు పాటించారో అర్థం అవుతుంది. ప్లానింగు కమీషను సూచనలను బట్టి చూసినా, అనేక రాష్ట్రాలలో అమలులోఉన్నది చూసినా, పంటలలో నాలుగవ వంతు అయిదవ వంతుకన్న ఎక్కువ కౌలు వుండకూడదని స్పష్టంగా ఉన్నది. అనేక రాష్ట్రాలలో ఈ విధంగానే వున్నది. బొంబాయిలో, పంజాబులో, బీహారులో, మధ్యప్రదేశ్‌లో ఈ విధంగానే ప్యాసు చేశారు. హైదరాబాదు చట్టంలో కూడా పండిన పంటలో 4, 5 భాగం కన్న ఎక్కువ వుండకూడదని చెప్పారు. ఆంధ్రరాష్ట్రంలో తెచ్చిన కౌలు బిల్లును తీసుకుంటే 50%వరకు కౌలు తీసుకోవచ్చునని ప్యాసు చేశారు. దానిపైనా అమలు చేస్తున్నారా అంటే లేదు. ఈ చట్టం వచ్చిన తరువాత పేలమందిని భూములనుంచి తొలగిస్తున్నారు. భూములను పేదలకు అందచేయాలని సాగుచేసే వారిని తొలగించకూడదని భూమిమీదనే ఆధారపడే వున్న వారికి భూములు యివ్వాలని ఉద్దేశంతో చట్టం తెచ్చామని చెబుతూ, అమలు చేయడంలో పోలీసుల భూస్వాములకు సహాయ పడుతూ చట్టం అమలు జరగకుండా కవులుదార్లకు భూమి దక్కకుండా చేసిన సందర్భాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చాము, రూల్సు తయారు చేయడానికి అయిదారు నెలలు పట్టినది. పెద్ద ఆందోళన చేసి deputations తీసుకుపెడితే కాని రూల్సు తయారు చేయలేదు.

శ్రీ కె. వెంకటరావు :—మీ deputations వల్ల ఏమీజరుగదు. తయారు చేయాలనే ఉద్దేశంతోనే తయారు చేశాము కాని Deputations కు జంకి వెంకటరావు పని చేయడని వారికే తెలుసు.

శ్రీ బి. శంకరయ్య :—Deputations కు జంకారని కాదు. చట్టం చేసిన తరువాత రూల్సు చేయడం ప్రభుత్వ బాధ్యత, చట్టం ప్యాసయిన నెలలోనో 15 రోజులలోనో రూల్సు తయారు చేయవలసి యున్నది. చట్టం ప్రకారం హక్కులు వచ్చినవారికి రక్షణలు కల్పించడం ప్రభుత్వ ఉద్యోగుల బాధ్యత ఈ చట్టంక్రింద ఇంతవరకు మా జిల్లాలో ఒక్క విచారణ కూడా చేయలేదు. కౌలు పిటీషన్లు కట్టలుకట్టి పెట్టారు. ఒక్కతహశీల్దారు కూడా దీనిని పట్టించుకోడంలేదు, అడిగితే మాకు సిబ్బంది లేదు అంటున్నారు. బడ్జెటు ఉపన్యాసాలలో చెప్పి యున్నాము. ఏ కలెక్టరు దగ్గర నుంచి అయినా wire మీద రిపోర్టు తెప్పించమనండి, భూములనుంచి తొలగిస్తున్నా, పంటలు పాడై పోయి మక్తాలు చెల్లించలేక పోయినా విచారించినట్లు రిపోర్టు అయినా తెప్పించమనండి, రూల్సు చేయడంమాత్రమేకాదు, ఎంత వరకు అమలు జరిగింది ; ఎంతవరకు చర్య తీసుకున్నారనే విషయం అడగవలసి యున్నది. యీనాముల విషయంలో ఒక బిల్లువచ్చినది. ఇదివరకు రైతులకు జిరాయితీ హక్కులుండే అనేక గ్రామాలలో మూడవ భాగం ఈనాముదారులకు ఇవ్వాలని చెప్పారు. మొత్తం భూమి అంతా నాలుగైదు రూపాయలు కట్టి అనుభవిస్తున్న కొన్ని గ్రామాల విషయంలో మొత్తం భూమిని ఈనాముదారుకు పట్టాకు ఇవ్వాలని అన్నారు. ఇదేనా భూమి సంస్కరణలు ? మధ్య దళారీలకు భూమినిచ్చి రైతులకు ఏ హక్కులు లేకుండా ఉండే దేనా భూసంస్కరణలు ? సాగుచేసుకునే రైతులకు భూమి నిచ్చి మధ్య దళారీలను తొలగించి వారికి అవసరమైన నష్టపరిహారం ఇవ్వవచ్చును. సాగుచేసుకునే భూములను మధ్య దళారీలకు ఇస్తే రైతులను తొలగించడమే కదా ! ప్లానింగు కమీషను సూచనలు మీముందు ఉన్నాయి. పంచితే భూమి ఎవరికీ ఏమీరాదనే

వాదం న్యాయమైనదికాదు. మొత్తం ఆంధ్రప్రదేశ్ కు అంతకు 40 లక్షల ఎకరాలు బంజరు భూములున్నాయని వెంకటరావుగారు చెప్పారు. ఆంధ్ర జిల్లాలలో 30 లక్షలు ఎకరాలు బంజరు భూములున్నాయని ఇదివరకే లెక్క ఇచ్చారు. ఇక లంకలు, దేవస్థానం భూములున్నాయి. భూమిలేని పేదలకు కొద్ది భూములున్న వారికి ఆర్థికంగా కొంత యినా ఆదాయం లేని చిన్న రైతులకు తొలగించబడిన కౌలుదారులకు భూములు పంచితే కుటుంబానికి రెండు ఎకరాలు అయినా రావడానికి వీలున్నది. సంవత్సరానికి అయిదారు నెలలయినా వీటిపై ఆధారపడి వస్తులు లేకుండా కూలిచేసుకొని బ్రతకడానికి అవకాశం ఉంటుంది. పంచడానికి ఏమిలేదని చెప్పడం న్యాయంకాదు. వాస్తవమైన విషయంకాదు. ప్రభుత్వ లెక్కలను బట్టి చూసినా ప్లానింగు కమిషనువారు చెప్పిన పద్ధతుల ప్రకారం కుటుంబానికి గరిష్ట పరిమితి పెడితే ఆంధ్రలోను తెలంగాణాలోను మొత్తం ఆంధ్రప్రదేశ్ లో భూమిలేని ప్రజలకు గ్రామాలలో నివసించే ప్రజలకు రెండెకరాలు వచ్చే అవకాశం ఉన్నది. భూమి అమ్మకాలను అన్యాక్రాంతాలను నిషేధిస్తూ తక్షణం ఒక ఆర్డినెన్సును తెచ్చి తరువాత బిల్లు తెచ్చి చట్టం చేయవలసి ఉంటుంది. ఈ విధంగా ఆర్డినెన్సుద్వారా నిషేధించకుండా ఉండబట్టే తెలంగాణాలో ఈ రోజున భూమిని ఎవరి దగ్గర నుంచి తీసుకోడానికి వీలులేకుండా ఉన్నది. భూస్వాములు అన్యాక్రాంతం చేస్తున్నారు, అమ్ము కుంటున్నారు, కేరళరాష్ట్రంలో చేసిన విధంగా ఆర్డినెన్సుద్వారా భూములనుంచి ఎవరిని తొల గించడానికి కాదని ప్రకటించాలి, ముందు ఒక ఆర్డినెన్సుద్వారా ఈ చర్యలను ఆపి తరువాత చట్టం తీసుకుని వచ్చి అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించవచ్చును. రెండు మూడు నెలల్లో చట్టాన్ని తీసుకువచ్చినా ముందుగా ఒక ఆర్డినెన్సు తీసుకురావాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ప్రభుత్వం దగ్గర ఉండే భూములను పేదవారికి ఇస్తామని అన్నారు. కాని పేదలు సాగుచేసుకునే భూములకు విపరీతంగా పెనాల్టీ వేస్తున్నారు. మే, జూన్ నెలలలో జమాబందీలు జరుగుతాయి ఒక్కొక్కరు బస్తా రెండు బస్తాలు పండినా ఇరవైముప్పై \, రూపాయలు పెనాల్టీలు చెల్లించుకోవలసిన పరిస్థితులు వస్తున్నాయి. పేదలకు భూములు ఇవ్వాలని అంటున్నామే కాని ఉద్యోగస్థుల లో మార్పులేదు. కాలం మారింది; కష్టపడిపండించేవారికి న్యాయం చేయాలని వారు అనుకోడంలేదు, ఎక్కడో గ్రామస్థులకు ఆటంకంగా ఉండే చోట్ల తప్ప లేని చోట్ల పెనాల్టీల తగ్గించాలని కోరుతున్నాను. పేదలకు ఇటువంటి బాధలు లేకుండా చర్యలు తీసుకోవాలని కోరు తున్నాను. దేవస్థానం భూములకు కౌలుదారీ చట్టం అమలు కావలసి యున్నది. ఒక ప్రక్క ప్రభుత్వం చట్టం చేస్తే Endowments Commissioner గారు కవులు దారీ చట్టం దేవాదాయభూములకు వర్తించదని వాటిని మినహాయింపు చేస్తారని పత్రికలో వ్రాశారు. చట్టం ఆ విధంగా ఉన్నా ఏ ధైర్యంతో వారు చెబుతున్నారో తెలియకుండా ఉన్నది. పత్రికలలో వ్రాసే సరికి ప్రతి జిల్లాలోని దేవాదాయ శాఖ ఉద్యోగులు ఈ భూములకు వర్తించకుండా చేయడానికి హైదరాబాదులో ఏదో జరుగుతోంది; భూములు మీకు రావని బెదిరించి ఈ రోజు తాకట్టాన డానికి ధర్మకర్తలు, అసిస్టెంటు కమిషనర్లు ప్రయత్నం చేస్తున్నారు.

ఈ విధంగా ఉద్యోగస్తులు ప్రభుత్వం చేసినటువంటి చట్టాన్ని ధిక్కరించి మాట్లాడి నప్పుడు దానిని గురించి ప్రభుత్వం చదివిందో లేదో తెలియదు. ప్రభుత్వం యిది గమనించి యీ రోజున రైతుల హక్కులను నిలబెడితేతప్ప చేయబోయే భూసంస్కరణలలో ప్రజలకు నమ్మకం కలుగదు. 1956 సంవత్సరంలో పాసైన ఈనాం చట్టాన్ని కూడా యీ దృష్టి తోనే పరిశీలించి

రైతుల భూములను ఇనాందారులకు పట్టాలనిచ్చే పద్ధతి ఆపి రైతుల హక్కులను కాపాడితే బాగుంటుంది. పెనాల్టీలు లేకుండా చేసి ఈ భూస్వాములు అమ్మే దానిని నిలిపించుతూ వెంటనే అర్డినెన్సు తీసుకు వచ్చి తరువాత ఒక సమగ్రమైన శాసనం తీసుకు రావాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Mr. Speaker :—Motion moved :*

That this Assembly recommends to the Government to introduce a Bill for land reforms in this Assembly immediately on the lines of the Suggestions of the Planning Commission.

* శ్రీ పి. ఎస్. అప్పారావు (పాలకొండ):—అధ్యక్షా; ఈ భూసంస్కరణల బిల్లు తీసుకు వచ్చారు దానిమీద కొద్దిగా చెప్పదలచుకున్నాను. ఈ బిల్లుకోసం చాలాకాలంనుంచి అందరూ నిరీక్షించి చూస్తున్నారు.

శ్రీ బి. శంకరయ్య :—వారు ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నారా? వ్యతిరేకిస్తున్నారా?

శ్రీ పి. ఎస్. అప్పారావు :—ఈ తీర్మానం న్యాయంగా తీసుకు రావలసినదని శ్రీ వెంకటరావు పంతులుగారికి మనవి చేస్తున్నాను. ఈ బిల్లు వస్తుందని చాలాకాలంనుంచి ప్రజలంతా నిరీక్షిస్తున్నారు. రైతులు కూడా నిరీక్షించారు. కాని యీ బిల్లువల్ల ప్రయోజనం ఏమీ కనిపించడం లేదు. వారు తెచ్చే బిల్లు వల్ల భూములు పంచుకుందాం అనే ధోరణి కనిపిస్తుంది గాని ఎవరి తాలూకు భూములు ఏ ప్రకారంగా పంచుకోవాలో తెలీకుండా వుంది. భూ సంస్కరణలు వస్తున్నాయి. వేగంగా వున్న భూములన్నీ దున్నేద్దాం అనుకుంటున్నారు గాని ఎవరికెన్ని ఎకరాలభూమి వస్తుందో అర్థం కావడం లేదు. శ్రీ వెంకటరావు పంతులు గారు ఇచ్చిన పుస్తకాన్నిబట్టి చూస్తే బూరుగుపువ్వును చిలుక చూస్తే పూవు ఎలా పేలిపోయిందో అదే ప్రకారంగా భూసంస్కరణలు తెచ్చారు గాని ఒక ఎకరాకూడా రాలేదని నిరాశ చెందేటట్టు కనిపిస్తున్నది. భూమి వచ్చేటట్టు లేదు.

శ్రీ కె. వెంకటరావు :—అసలు బిల్లే పెట్టండి యేమీలేదంటారేమిటి?

శ్రీ పి. ఎస్. అప్పారావు :—వారు చెప్పే అంకెల్నుబట్టి చెబుతున్నాను. బిల్లు వచ్చేది ఒక్క భూసంస్కరణలకేనా అని అడుగుతున్నాను. ఈ రోజు భూమిమీదనే రోజురోజుకు రూపాయమీద రూపాయి శిస్తు వేస్తున్నారు. పెద్ద పెద్ద భవనాలున్నాయి. వాటిమీద అధికంగా అద్దెలు వస్తున్నాయి. ఇనాందారుల బిల్లు తెచ్చారు, రైతుకు హక్కు ఇచ్చారు సంస్కరణలంటూ పెడితే అన్నింటికి ఒకేసారి పెడితే బాగుంటుందని నా ఉద్దేశ్యము. భూములే కాక మిల్లులున్నాయి. యంత్రాగారాలున్నాయి. బ్యాంకులో డబ్బు నిలువలున్నాయి. వాటికికూడా సమతా ధర్మంపై సంస్కరణలు తీసుకు రావాలి. భూసంస్కరణలువస్తున్నాయని ముందుగానే భార్యల పేర కొంతమంది వ్రాశారు. తమ్ముళ్ళపేర పుట్టబోయే కొడుకుల పేర వ్రాశారు. ఈ బిల్లు వస్తుంది కాబట్టి సంవత్సరానికి ముగ్గురేసి పిల్లలు పుట్టినట్లు వారి పేళ్ళను కూడా వ్రాస్తున్నారు ఆ ప్రకారంగా జరుగు తున్నాయి. సంవత్సరానికి ముగ్గురు బిడ్డలను కంటున్నారు.

శ్రీ కె. వెంకటరావు:—అటువంటి శక్తిసామర్థ్యాలు ఎవరికున్నాయో మనవి చేస్తారా?

శ్రీ పి. ఎన్ అప్పారావు :—అందుచేత పెట్టబోయే బిల్లు అందరికీ అన్నింటికీ ఒకే విధంగా పెడితే బాగుంటుందనుకుంటున్నాను. వందలకొలదీ ఎకరాల భూమిని తీసుకొని సాగుచేయడానికి ప్రయత్నిస్తున్నారు. కాని పంట పండించ కుండా వున్నారు. ఎందుచేత ? ఒక మనుష్యుడు 200 ఎకరాలు లేక 300 ఎకరాల భూమిని సత్తువ చేసి పంట పండించలేడు. అందుచేత ఒక కుటుంబానికి పల్లపైతే 50 ఎకరాలు, మెరకైతే 100 ఎకరాలు పెట్టి మిగతా భూమిని వేరే రైతులకు 5 ఎకరాల చొప్పున యిచ్చి Tenancy Bill అనువర్తిస్తే బాగుంటుంది. ఆ విధంగా ఆ 50 ఎకరాలమీద పన్నులు వేయవచ్చును. తద్వారా గ్రామాలను అభివృద్ధి చేయండి, కాలువలను అభివృద్ధి చేయండి. అలాగైతే రైతుకు నష్టంలేదు. నేను15 ఎకరాలలో వ్యవసాయంచేసె సంవత్సరానికి మూడు పంటలలో ఎకరానికి 100 బస్తాలు పండించి బహుమతిని పుచ్చుకున్నాను.

శ్రీ కె. వెంకటరావు :—వ్యవసాయంకూడా మీరు చెప్పిన పిల్లల్ని పుట్టికనే రేటులోనే జరుగుతుందన్నమాట. ఎకరానికి వంద బస్తాలు!

శ్రీ పి. ఎన్ అప్పారావు :—సంవత్సరానికి మూడు పంటలలో ఎకరానికి 100 బస్తాలు పండిస్తున్నాను. ఎందుచేత ? భూమి తక్కువగా వున్నదీ కనుక హెచ్చు సారవంతము చేసి పంట పండిస్తున్నాను. అదేవిధంగా 50 ఎకరాలు పరిమితి పెడితే సత్తువ చేసుకొని ఆదాయం వృద్ధి చేసుకోడానికి వీలుంటుంది.

శ్రీమతి వై. సీతాకుమారి (బన్నవాడ):—గౌరవసభ్యులు వాడిన భాష సభా మర్యాదకు బాగులేదని నేను మనవి చేస్తున్నాను.

శ్రీ పి. ఎన్. అప్పారావు :—జనరలుగా ముగ్గురు పిల్లలంటే పిల్లలని కాదు—పంపకాన్ని బట్టి చెబుతున్నాను. ఈ మోస్తరుగా ఎంతమందీ పిల్లలుంటే అంతమందికి వ్రాస్తున్నారు.

శ్రీమతి వై. సీతాకుమారి :—ఆ సమయంలో వారు వాడిన భాష బాగా లేదని నేను అభిప్రాయపడుతున్నాను.

మిస్టర్ డిప్యూటీస్పీకర్ :—స్త్రీలు ఎక్కువమంది యీ శాసనసభలో వున్నారు కనుక యిక మీదట మీరు సభ్యతగా ప్రవర్తించాలి.

శ్రీ పి. ఎన్ అప్పారావు :—సభ్యతగానే వున్నదీ. ఆస్తి పంపకంగురించి చెప్పాను. అనేక విధాలుగా వ్రాయిస్తున్నారు. తమ్ముల పేర, చుట్టాల పేర పెడుతున్నారు. పుట్టినవారికికాదు పెంపుడు కొడుకులకూ వ్రాస్తున్నారు. ఈ విధంగా సంవత్సరానికి మూడు వ్రాతలు వ్రాసుకోవచ్చు. దానికేమీ అభ్యంతరం లేదు.

శ్రీమతి వై. సీతాకుమారి :—వారు అట్లాంటి భాష మాట్లాడలేదు. సంవత్సరానికి........, అని చాలా అసహ్యాసగా మాట్లాడిహాసు.

శ్రీ గోపిడి గంగారెడ్డి :—కలంతో కూడా వ్రాస్తుంటారు. కలంతో పుట్టి వుండవచ్చు. గర్భంలో పుట్టినవారు కాదు.

శ్రీ పి. ఎస్. అప్పారావు :—అందుచేత వల్లం భూములు 50 ఎకరాలు మెరక భూములు 100 ఎకరాలు పరిమితిపెట్టి రైత్వారికి మిగతా భూమిని పేదరైతులకిస్తే—కుటుంబానికి 5 ఎకరాలచొప్పున యిస్తే అసలు భూమిగల ఆసామీకి కూడా కొంత రాబడి వస్తుంది, పన్ను వేసుకోవచ్చు; ఆ ప్రకారం చేస్తే బాగుంటుందని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ (పాతపట్నం—జనరల్) :—అధ్యక్షా! ఈ నాడు శంకరయ్యగారు తీసుకువచ్చిన తీర్మానములో నాకేమీ ప్రత్యేకత కన్పించలేదు. అక్కడ ప్లానింగ్ కమిషన్‌వారు ఇక్కడ రాష్ట్రప్రభుత్వములు ఈ భూసంస్కరణల గురించి ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని, వాటిని వెంటనే అమలులో పెట్టాలని ప్రయత్నము చేస్తున్న సంగతి శంకరయ్యగారికి, అందరికి తెలుసు రాష్ట్రములో పరిస్థితులను బట్టి, ఎంతవరకు భూమి వుండాలో. ఒక కుటుంబ ఆదాయము ఏ విధముగా వుండాలో అని నిర్ణయించాలని ప్లానింగ్ కమిషన్‌వారు చెప్పారు ప్రతిఒక్కరు ఈ భూసంస్కరణలు కావాలంటున్నారు. కాని ఈనాడు భూమిపై వచ్చే ఆదాయము ఏవిధముగా వున్నది. అదీ సక్రమముగా వస్తువున్నదా? అని విచారించాలి. ఇప్పుడు 50 ఎకరాలు వున్న ఆసామి తన పిల్లలను చదివించే తాహతులేని పరిస్థితులు వున్నాయి. దానికి కారణం ఏమిటో గమనించాలి. ఒకరికి 500 ఎకరాలు ఒకరికి అసలు భూమే లేకుండా పోవాలని కాదు. భూమిని సక్రమముగా పంచిపెట్టాలి, తక్కువ భూమిలో ఎక్కువ పంటపండించాలనే అందరి ఉద్దేశ్యము. ప్రతి ఒక్కరికి తినటానికి సరైన తిండి కల్పించాలనే కాంగ్రెస్ యొక్క ఆశయము. అందుకే socialistii Pattern of society ని తీసుకురావలని కాంగ్రెస్ మొదటినుంచి ఆశిస్తోంది. దానిని గురించి ఈ నాడు అన్ని రాష్ట్రములలో ప్రచారము చేయర మే కాకుండా సక్రమమైన చర్యలు తీసికొని, ఎటువంటి Reforms తీసుకురావాలో జాగ్రత్తగా ఆలోచించవలసివుంది. భూమి ఎవరు తీసుకుపోయేది దాచుకుపోయేదికాదు. భూమి పంచుకొంటున్నారంటే, తన తమ్ములకో, కుమారునకో, యింకొకరికో యిస్తున్నారంటే తన కుటుంబములోనివారే పంచుకొన్నంత మాత్రమున తప్పేమిటని ప్రశ్నిస్తున్నాను. భూసంస్కర ణలు రాకముందు వ్యవసాయదారుని పరిస్థితి ఏ విధముగా వున్నదో ప్రతి సభ్యుడు గమనించాలి. ఇది కేవలము ప్రజలలో ఉద్రేకాన్ని రెచ్చకొట్టే ప్రచారము మాదిరిగా వుండకూడదు. ఇతర త్రావ్యాపకాలులేకుండా, శాశ్వతముగా భూమిమీద ఆధారపడి, తన కుటుంబమును పోషించు కోటానికి అవకాశము లేని పరిస్థితులు వున్న మన గ్రామ సీమలలోని వ్యవసాయదారుల పరిస్థితి ఈ నాడు గమనించకుండా, వారికి కావలసిన సౌకర్యాలు ఏమి చేస్తున్నారో, ఈ ప్రభుత్వము ఎంతవరకు ముందుకు పోతువున్నదో, ఎంతవరకు కృషిచేస్తున్నదో తెలిసికొనాలి. ఎకరానికి 100 బస్తాలు పండిస్తున్నారని నరశింహాప్పారావుగారు చెప్పారు. ఆ విధముగా సదుపాయములు కల్పిస్తున్నప్పుడు 15 ఎకరాలలో, 30 ఎకరాలలో ప్రతి కుటుంబము తృప్తిపొందుతుంది. 100 ఎకరాల పంటకు సంవత్సరానికి 500, 600 రు. శిస్తు ప్రభుత్వానికి చెల్లిస్తూ, పంటలు పండక బాధపడే కుటుంబములు ఎన్ని వున్నవో గమనించాలి. రైతాంగము యొక్క ఆర్థిక పరిస్థితి గమనించటానికి మీరు బహిరంగముగా విచారణజరిపించండి. పెద్ద ధరలు వచ్చాయని మనం

అనుకొంటున్నాము. కాని ఎన్ని కుటుంబాలు రోజురోజుకు క్షీణిస్తున్నవో మనం గమనించాలి. భూసంస్కరణలు కావాలనే విషయములో ఎవరికి అభిప్రాయభేదములు లేవు. దాని గురించి ప్రభుత్వముకూడా తగిన చర్యలు తీసికొంటోంది. ఢిల్లీ ప్రభుత్వము గూడా దానిగురించి పట్టుదలగా వుంది. ఏ రాష్ట్రములో ఏ విధముగా వ్యవసాయ పరిస్థితులు వున్నవో, వ్యవసాయ పరిస్థితులను అనుకూలమైన ఇతర పరిస్థితులున్నవో, లేవో, గమనించాలని ఆదేశిస్తున్నది. మరి ఈ తీర్మానము యొక్క importance ఏమిటో నాకు కన్పించటము లేదు.

100 ఎకరాలువున్న కుటుంబము, 500 ఎకరాలున్న కుటుంబము, 50 ఎకరాలున్న కుటుంబము మెట్టప్రాంతాలలోను పల్లపు ప్రాంతాలలోను జిల్లాలవారిగా, వారి పరిస్థితి గమనించాలి. అమెరికా దేశంలోను, జపాన్‌దేశంలోను, ఇటలీ దేశములోను 15 ఎకరాలువుంటే మోటారు కారు హాయిగా వుంచుకొని, తన కుటుంబములోని వారందరను విద్యావంతులుగ చేసుకొని సౌభాగ్యము అనుభవిస్తువుంటే మన దేశములో 100 ఎకరాలువున్నవాడు కూడా వచ్చిన మిత్రుడికి సరైన భోజనం పెట్టలేకుండా వున్న పరిస్థితులు గమనించాలని మనవి చేస్తున్నాను. ఉద్రేకాలలో ఆవేశాలలో తొందరబడి శాసనాలు చేసుకుపోయి, దాని తరువాత వచ్చే ఫలితాలను మనం అనుభవించాలి. భూసంస్కరణల గురించి కమ్యూనిష్టు సోదరులు గట్టిగా మాట్లాడారు. వాళ్లు మాట్లాడాలి. వారికి ఈ రైతాంగము పట్ల విశ్వాసము లేదు. ఈ రైతాంగములో ఎంత అల్లకల్లోలము జరిగితే దేశంలో వారికంత మేలు ఈ రైతాంగము దేశములో సక్రమముగా ప్రవర్తించినన్నాళ్లు వారికి ఈ దేశములో తావులేదని వారికి తెలుసు. రైతాంగాన్ని ముక్కలముక్కలుగా చేసి రైతాంగానికి తావు లేకుండా చేసి తరువాత దేశాన్ని చేసుకొన్నారు రష్యావారినిగురించి నేను చెప్పను. కాని తక్కిన మిత్రులు మాత్రం రైతాంగము యొక్క పరిస్థితిని గమనించాలని నేను చెబుతున్నాను. భూసంస్కరణలో 15 ఎకరాలు పెట్టండి. మేము సిద్ధంగా వున్నాము. ఈ వాడుభూ కామందులమను కొనేవారందరును మనం నచ్చ చెప్పవచ్చు.

రైతాంగానికి కావలసినది నీటి సదుపాయము. వారికి కావలసినది credit facilities ఈనాడు మన ఆంధ్రదేశం లెక్కలు చూసుకొంటే సంవత్సరానికి 90 కోట్ల రూపాయలు వాళ్లకు Credit facilities కావాలని మన లెక్కల్లో తేలుతుంటే మనం Co-oper atibe ) ద్వారా 3.1% ఇస్తున్నాము. లేకుంటే షేడ్యూల్డు బాంకు ద్వారా 0.5% ఇస్తున్నాము. తక్కువ అప్పంతా ఎక్కడ్నుంచి తీసుకువస్తున్నారు. వడ్డీ వ్యాపారుల నుండి తెస్తున్నారు వారినికిస్తున్న వడ్డీ ఎంత ? ఏ విధంగా ఈ వడ్డీ వ్యాపారస్థులు ధనాన్ని దోచుకుపోతున్నారురో మీరు గమనించాలి. అందుచేత ఇర్రిగేషన్ facilities కల్పించి, వారి Credit facilites పంటకు రేటు ఎంత ? ఈ సంవత్సరము ఎంత ఆదాయమువస్తుందను కొంటున్నారు, అనే విషయములు ఆలోచించుకోవాలి. ధరలు తగ్గి 5000 రు. 2000 రు. ఆదాయము వున్నప్పుడు నా బడ్జెటును నేనే నిర్ణయించుకోవాలి. ఆదాయము తగ్గినా ఖర్చులు తగ్గవు. పట్టణంలో చదువుకొనే కుమారునకు నెలకు 100 రు. పంపించటము తప్పదు ఖర్చులన్ని మామూలుగానే వుంటాయి. ఆదాయం మాత్రం తగ్గిపోతుంది. అందుచే మినిమమ్ రేటు నిర్ణయించండి. ఈ రేటుకంటే ఈ ధరలు తగ్గవు అని నిర్ణయించండి. వాటన్నింటి కంటె మార్కెటు facility చాలా అవసరం. తనపంట తనదగ్గర వున్న

ప్పుడు ధరలు తక్కువగా వున్నప్పుడు ధరలు తక్కువగా వుంటున్నాయి. రైతు చేతుల్లోనుండి మధ్యవర్తి చేతుల్లోకి పోయిన తరువాత ఇతరులకు పోయేటప్పుడు ధరలు విపరీతంగా పెరిగి పోతున్నాయి. అందుచేత మార్కెటు facilities సక్రమముగా వుండాలి. insurance Co-operative అవసరం. That is most important. ఎందుకంటే ఈ పేళ్ళ ఎంతో పండించుకొంటాము. సంవత్సరం పొడుగునా కష్టపడతాము. పొలంలో వున్న పంట గాలికో అధికవృష్టికో, అనావృష్టికో పాడైపోతుంది. ఒక సంవత్సరం పంట పోయిన తరువాత 5 సంవత్సరాలు పెద్ద పంటపండినా ఆ రైతు మామూలు స్థితికి రావటము చాలకష్టము. మనం ఆమోదించిన ఈ 5 సూత్రాలను ప్రభుత్వం ఏమి చేస్తుంది. ఇది ఈ 5 సూత్రాలు సక్రమంగా అమలుపెట్టిన తరువాత 15 ఎకరాలు పెట్టండి, 10 ఎకరాలు పెట్టండి, ఎవరికీ ఎటువంటి అభ్యంతరము లేదు తన కుటుంబానికి సరిపోయే పంట వస్తుంది తనకింత రాబడి వస్తుంది. తన పంట తన యింటికి వస్తుందనే విశ్వాసము, ఏర్పడిన తరువాత 100 ఎకరాలకు బాధపడ వలసిన అవసరము లేదు. యిన్ని ఎకరాలు అనవసరము. ఈ ఎకరాలను తగ్గించుకొని ఎవరు వ్యవసాయానికి పూనుకొంటారో, వ్యవసాయం పట్ల ఎవరు విశ్వాసముగా వుంటారో, వారిని ముందుకు రమ్మనండి. యుద్ధకాలంలో మన ధాన్యపు రేట్లు పెరిగిపోతున్నప్పుడు కంట్రోల్ అన్నారు. 200 రు. కంటె హెచ్చు అమ్మితే జైల్లో పెడతామన్నారు. రైతు ఇంట్లోకి పోయి, తనకళ్ళంలో వున్న ధాన్యాన్ని అతని కొట్లోవున్న ధాన్యమును, జొళ్ళు గూడా విడవ కుండా, కోట్లలోకి జొరబడి ఆఫీసర్లు తీసికొన్నారు కాని రైతుకు కావలసిన పరికాకరాలు, రైతు కుటుంభానికి కావలసిన ఇతర వస్తువులు ఏ ప్రభుత్వమైన వారిచేతుల్లో పెట్టిందా అని గమనిస్తే అలా జరగలేదని తెలుస్తుంది. అయినప్పటికీ ఓర్పుతో, దేశంయొక్క క్షేమం తనకు కావాలని, దేశంయొక్క సౌభాగ్యము తనకు కావాలని, ఈ దేశంలో శాంతి నెలకొల్పాలనే ఉద్దేశ్యంలో అన్ని బాధలుపడి, మీరు కంట్రోలు అన్నా సరే బుర్రవంచి అన్నింటికి సిద్ధం అవుతున్నాడు. తనకు కావలసిన వస్తువును black market లో 13,10 రు. లిచ్చి కొను కొంటున్నాడు. ఈనాడు రైతు కుటుంబములోని వారు ఎంతమంది చదువుకొంటున్నారని నేను అడుగుతున్నాను. ఎంతమందికి చదువుకోటానికి అవకాశాలు వున్నాయని అడుగుతున్నాను భూమిని రేపు ప్రొద్దునే పంచి పెట్టండి. మరి దానిమీద వచ్చే రాబడి ఏమిటి ? ఎంతవరకు మీరు రాబడిని ఇవ్వగలరు ? ప్లానింగ్ కమిటిలో చెప్పారు. ప్లానింగు కమీషన్ వారుకూడా భూసంస్కరణలు చేయవలెనని చెప్పారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కూడా ఈ విషయంలో తప్పకుండా చర్యతీసుకుంటుంది. ఐతే అట్టి చర్యలు తీసుకునేముందు నేను చెప్పిన ఐదు సూత్రములు గురించి ప్లానింగ్ కమీషన్ వారు ఏమి చెప్పారని అడుగుతున్నాను. ఈనాడు రైతులకు క్రెడిట్ ఫెసిలిటీస్ సరిగాలేవు.అతని ఆదా యంలో నూటికి 50 వంతులు వడ్డీ రూపంగానే అప్పులు ఇచ్చేవారికి పోతున్నది. అదేవిధంగా ధరల విషయంలోకూడా చాలా వ్యత్యాసాలు కన్పిస్తున్నాయి. కుటుంబ పరిమితిగా పది ఎకరాలు పదిహేను ఎకరాలు నిర్ణయిస్తే మాకేమి అభ్యంతరంలేదు. ఐతే ప్రజాస్వామికమని, ప్రజా ప్రభుత్వం అని చెప్పేవారు దేశ సౌభాగ్యమునకు మూలకందమైనటువంటి రైతు యొక్క బాగోగ లను గురించి శ్రద్ధతీసుకోవలసివుంది. రాత్రింబగళ్ళు కష్ట పడి మనము ఎన్ని కష్టములు పెట్టినా మనవల్ల ఎట్టి ఉపయోగం లేకపోయినా దేశసౌభాగ్యానికి నిరంతరం పాటుపడే రైతుకు కావలసిన సదుపాయాలు కలుగచేయవలసిన భాద్యత మనమీద ఉన్నదని మనవిచేస్తున్నాను. దేశం కరువు

కాటకాలతో పీడింపబడకుండా కాపాడే రైతుకు మనం అన్ని సదుపాయాలు చేయవలసిన విధి ఉన్నది. భూసంస్కరణలు తీసికొని రావడానికి మాకు ఎటువంటి అభ్యంతరంలేదు. భూసంస్కరణల విషయంలో కాంగ్రెసు ప్రభుత్వం ఎన్నడూ వెనుకాడదు. కాంగ్రెసు ప్రభుత్వమే జమీందారీలను రద్దు చేసినది. ఇనాందార్లలో నూటికి 90 మంది కాంగ్రెసు అభిమానులై ఉండి కాంగ్రెసులో పనిచేసి దేశస్వాతంత్ర్య కొరకు ఎంతో త్యాగంచేసిన వారిని కూడా భూసంస్కరణల పేరుతో దేశసౌభాగ్యం కొరకు మీరు బయటకు పొండనిచెప్పాము. పెద్ద భూస్వాములన్న వారు ఎంత పెద్దవారైనప్పటికీ కూడా, భూములనుంచి పొమ్మనటానికి మేము సిద్ధమే. కాని మనము కొన్ని ప్రధానమైన విషయాలను విస్మరించకూడదు. భారతదేశం ముఖ్యముగా వ్యవసాయిక దేశం. వ్యవసాయంపైననే మన భవిష్యత్తు ఆధారపడి ఉన్నదనీ చెప్పుతూ రైతులయొక్క శ్రేయస్సుకు కావలసిన సౌకర్యములను కలుగచేయకుండా భూసంస్కరణల పేరుతో వారిని ఇబ్బందుల పాలుచేయడం మంచిదికాదు. పది ఎకరాల భూమి ఇంకొక్కరి చేతులలో పెట్టారను కోండి. ఆయన ఈ పది ఎకరాలను ఎంతకాలం తనచేతులలో పెట్టుకోగలడు. నీరు లేకపోతే, వ్యవసాయం చేసుకోడానికి ధనం లేకపోతే, పండిన పంటకు సరియైన ధరలేకపోతే మూడు రోజులు ఆ భూమిలోనుండి, నాల్గవ రోజున ఆభూమి కాస్తా ఏ భూకామందునికో అమ్ముకొని ఏ ఖరగ్పూరులోనో, మద్రాసులోనో కూలిచేసుకొవడమో తప్ప వేరు గత్యంతరంలేదు ఇటువంటి పరిస్థితిని మన రైతాంగమునకు కలుగచేయవద్దని మనవిచేస్తున్నాను. భూ సంస్కరణలను అమలు చేయుటకు ముందుగా నేను చెప్పిన 5 సూత్రాలను గురించి ప్రభుత్వం సమగ్రంగా ఆలోచించాలి. భూసంస్కరణలు వెంటనే అమలు చేయమని చెప్పుతున్నా. కమ్యూనిస్టు సోదరులు, ఇతరుల అన్ని విషయాలను పరిశీలించాలి. కాంగ్రెసు ప్రభుత్వం భూసంస్కరణలను అమలు చేయుటములో వెనుకాడదు. కాంగ్రెసు ప్రభుత్వం మొదటి పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా అమలు జరిపి దేశాన్ని ముందుకు తీసుకొని పోగలిగినది. ఇదేవిధంగా రెండవ, మూడవ, నాల్గవ పంచవర్ష ప్రణాళికలు పూర్తిఅయ్యేనాటికి దేశంలో ప్రతివారికి మూడు పూటా తిండి,కావలసినంత బట్ట ఇల్లు కల్పించాలని కాంగ్రెసు ప్రభుత్వం పూనుకొన్నది. ఆ కార్యక్రమం చేస్తున్నది అందుచేత భూసంస్కరణలను అమలు చేసే విషయంలో ఎవరు ఎట్టి అపోహపడ నక్కరలేదు. ఈ తీర్మానమును ఇపుడు తీసుకొనిరావలసిన అవుసరంలేదు. దీనిని గురించి ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచించాలి. ప్రతి సభ్యుడూ నేను చెప్పిన ఐదు సూత్రాలు గురించి యోచించాలని వాటిని ఏ విధంగా అమలు చేయాలనే విషయంలో తగిన సలహాలివ్వాలని మనవిచేస్తున్నాను. భారత దేశ సౌభాగ్యమునకు మూలకందమైన రైతాంగాన్ని రక్షించడం మన ప్రధాన ఆశయముగా భావించుకోవాలి. రైతాంగాన్ని రక్షించడానికి తగిన చర్యలు తీసుకోవాలని మనవి చేస్తున్నాను. పార్టీ బేసిస్‌మీదగాని, పార్టీ ప్రచారనిమిత్తంగాని ఈ సమస్యను ఉపయోగించు కోకూడదని నేను మనవిచేస్తున్నాను. ఈ విషయంలో కాంగ్రెసు ప్రభుత్వం సరియైన చర్య తీసుకుంటుంది కాని ఆచర్యలు తీసుకొనేముందు రైతాంగానికి కావలసిన సౌకర్యాలను గురించి ప్రతి ఒక్కరూ దీర్ఘంగా ఆలోచించాలని మనవిచేస్తూ అవకాశము ఇచ్చి నందుక మీకు ధన్యవాదా లర్పిస్తున్నాను.

శ్రీ దొడ్డా నరసయ్య (హుజూర్‌నగర్): అధ్యక్షా, కొందరు మిత్రులు మాట్లాడుతూ శ్రీ శంకరయ్యగారు యిటొంటి తీర్మానములను ప్రవేశ పెట్టవలసిన అవసరంలేదని, ఇంతక పూర్వమే

ఆ విషయం ఆలోచింప బడుతున్నదని చాలా దీర్ఘంగా మాట్లాడారు. ఈ విధంగా మాట్లాడుతూ వారు అనేక సిద్ధాంతాలనుగురించి చర్చించారు. ఐతే ఈ నాడు భూ సంస్కరణలను గురించి చర్చజరగడములేదని ఆలోచించడంలేదని ఎవరూ చెప్పడంలేదు. చర్చ జరుగుతున్న మాట **నిజమే.** ఈ భూసంస్కరణల విషయం వచ్చినపుడు ప్లానింగ్ కమిషన్‌వారు తెలియచేసిన సూత్రాలను మనం దృష్టిలో పెట్టుకోవలసివుంది. ప్లానింగ్ కమిషన్‌వారు 36,000 రూపాయిలను కుటుంబ నిఖారాదాయానికి గరిష్ట ప్రమాణంగా నిర్ణయించి తద్వారా బీద ప్రజానీకానికి ముఖ్యంగా వ్యవసాయ కూలీలకు జీవనోపాధికల్పించే ఉపాయం ఆలోచించాలని తెలియచేశారు. ఐతే యీ సూత్రాన్ని మన ప్రభుత్వం ఎంతవరకు పాటిస్తున్నది అనే విషయం గమనించవలసివుంది. ఆచరణలో ఏమిజరుగుతున్నది. ప్లానింగ్ కమిషన్‌వారు సూచించిన సూత్రముల ప్రకారము భూ సంస్కరణలు అమలు పరిచి వాటిని సక్రమంగా ఆచరణలో పెట్టడానికి ప్రభుత్వం సత్వరచర్యలు తీసుకోవాలి. భూసంస్కరణలు రాబోతున్నవి అన్న పేరుతో భూ స్వాములు కౌలుదారులను తరతరాలు గా భూములను సాగుచేసుకుంటున్న పేద రైతులను కేవలం నామ మాత్రంగానే తమపేర పట్టాలు ఉన్నవన్న కారణాన్ని అవకాశంగా తీసుకొని భూములనుంచి తొలగిస్తున్నారు. ఎన్నో ఇనాము పట్టాలు సృష్టిస్తున్నారు భూమి సంస్కరణలను తెస్తాము తెస్తాము అని చెబుతూండటమువల్ల ఏ పేద ప్రజలనైతే మనము రక్షించాలని అనుకుంటున్నామో ఆ పేద ప్రజలకు రక్షణ లేకుండా పోతోంది. మన ఆశయానికి భంగం కలుగుతోంది. ఈ చట్టం త్వరగా తీసుకొని రావాలని కోరడంలో మా ఉద్దేశ్యం తరతరాలుగా భూమిని సాగుచేసుకుంటున్న వారికి రక్షణ కల్పించవలెననేకాని కమ్యూనిస్టుపార్టీయొక్క ప్రచారం కోసమనిగాని దేశంలోని పేద ప్రజలను రెచ్చగొట్టేకోసమనిగానికాదని మనవి చేస్తున్నాను. మా ఉద్దేశ్యాలను శంకిస్తూ కొంతమంది మిత్రులు వారి వాదనలలో జపానువరకు అమెరికా వరకూ పోవడం సంభవించింది.

తెలంగాణాలో భూసంస్కరణలు ఆచరణలో విఫలమవుతున్నాయనడానికి అనేకమైన ఉదాహరణలు చెప్పగలను. ఐతే అక్కడక్కడ వీటిని అమలుచేయటానికి ప్రయత్నం కూడా జరుగుతూన్నది. ఈ సంస్కరణల చట్టం ప్యాసుచేయబడిన నాటినుంచి రైతులకు చాలా అన్యాయాలు జరుగుచున్నాయి. కౌలుదారీ రైతాంగానికి రక్షణకల్పించే సంకల్పంతో యీ చట్టం చేయబడినప్పటికీ కౌలుదార్లకు సదుపాయాలు కలగడం లేదు. అనేక బేదఖలీలు అనాటినుంచి జరుగుతున్నాయి. ఇనామీ పట్టాలను సృష్టించడం, చేతుల మార్పిడీ జరుగుతున్నది ఇటువంటివన్నీ జరుగకుండా చేయడాని ఎట్టి చర్యలూ తీసుకోబడడంలేదు. చట్టాలు యీనాడుకాగితాలమీదనే కన్పిస్తున్నాయి కాని రైతులకు ఎటువంటి లాభం కలుగుటలేదు. భూ సంస్కరణల చట్టం ప్రవేశపెట్టబడిన దగ్గరనుంచి యీనాటివరకు సెంటు భూమికూడా రైతాంగానికి చెందకుండా చేసేదానికోసం భూస్వాములు బినామీ పట్టాలు సృష్టించడం బేదఖళ్ళుచేయడం జరుగుతున్నది. ఈ విషయాలన్నీ ప్రభుత్వంవారి నివేదికలలో యున్నాయి. నల్గొండ జిల్లాలో యీనాటికికూడా పెద్ద పెద్ద భూస్వాములు వారియొక్క సర్వశక్తులను వుపయోగించి అమాయక రైతాంగాన్ని, 60,70 సం. లుగా కౌలుదార్లగా వుంటున్న రైతాంగాన్ని తొలగించి బేదఖళ్ళు చేయడం జరుగుతున్నది. నల్గొండ జిల్లాలోని పెద్ద భూస్వాములలో ఒకరు హెచ్చు పలుకుబడిగలవారు అయిన బాబాసాహెబ్ పేట దేశ్‌ముఖ్‌గారు చేస్తున్న పనులు అందరికి తెలిసేవుండవచ్చు. బాబాసాహెబ్‌పేట యిలాకాలోని కౌలుదార్లను బేదఖలుచేస్తూ వుంటే

రైతాంగం అధికార్లను అప్రోచ్ అయినప్పుడు అధికారులు కొంతవరకు యీ అందోళనకు తట్టు కోలేక చట్టాన్ని ధిక్కరించిన జమీందారును ప్రాసిక్యూట్ చేయాలని కలెక్టరులాంటివారు ఆలోచిస్తున్నప్పుడు ఆ జమీందారులు మంత్రులదగ్గరకు రావడం ప్రసన్నులను చేసుకోవడం అందులో ముఖ్యంగా యీ భూసంస్కరణలను గురించి మంత్రులు స్వయంగా యిందులో జోక్యం కల్పించుకొని ఒక గౌరవమైన కుటుంబములోని యితాంటివారిని యిలా చేయడం అన్యాయమన్ని యిట్లా చేసేటప్పుడు కలెక్టరులాంటివారు ఆలోచించిచేయవలసి వుంటుందని హెచ్చరికలు పంపించినటువంటి ఉదాహరణలు లేకపోలేదు.అంతేగాదు యివాళ మక్తా రైతాంగం యొక్క సమస్యలున్నాయి హైదరాబాద్ స్టేటులోని భూ సంస్కరణముల శాసనలలోని ఒక భాగమైన జాగీర్ రద్దు చట్టంప్రకారం మక్తా సాగుదార్లు ఆ చట్టం అమల్లోనికి వచ్చిన నాటినుండి కూడాఆటోమేటిక్ గా పట్టాదార్లు అవుతారు.

కాని, సూర్యాపేట తాలూకాలో ఒక పేరుబడ్డ మక్తా, దేతూాల మక్తాఅనేది ఉన్నది ఆ మక్తాలో 60, 70 సంవత్సరాలుగా రైతాంగం సర్వహక్కులు అనుభవిస్తున్నారు. కాని, ఈనాటివరకు కూడా ఆ రైతాంగానికి పట్టాహక్కులు సంక్రమించకపోగా వారు ఈవేళ కోర్టుల పాలై తిరుగుతున్నారు. ఆ భూమిలో వారిని మధ్యలో కౌలుదార్లుగా కూర్చేదాని కోసం, అక్కడ జమీందారిణిగారు భూదానం కూడా చేస్తున్నారు. వారి చేతుల్లో భూమి ఉన్నా అంటే లేదు. కాని ఆభూములన్నీ కూడా భూదానంచేస్తూ వారిని కౌలుదార్లుగా మార్పించి ఇంత నష్టపరిహారం పొందాలని ప్రయత్నం చేస్తున్నారు. ఆ వ్యవహారం ఈనాటి వరకు సాగుతూనే ఉన్నది. ఈ సంగతి తెలంగాణాలో ఉన్నటువంటి నాయకులందరికీ కూడా తెలుసు. ఈ మక్తా వ్యవహారంలో ఆతాంటివారంతా కూడా జోక్యం కలుగజేసుకొని రైతాంగానికి రక్షణలేకుండా చేస్తూఉండే, ఈ భూసంస్కరణవలన అటు మక్తా రైతాంగానికి ఏమీ లాభంలేక పోగా ఇటు బి. గోవిందరెడ్డిలాంటి, వారికివున్న 5, 6 వేల ఎకరాల భూమిలో ఇప్పటిదాకా కౌలుదార్లుగా ఉన్నటువంటి లంబాడీ రైతాంగానికి రక్షణ లేకపోగా, ఇక మనము ఈ భూసంస్కరణ చేస్తాము, దీనిని అమలు పరుస్తాము, తద్వారా దేశాన్ని ఏదో అభివృద్ధి చేస్తాముఅంటే, చెప్పే దానికి, ఆచరణలో జరిగేదానికి ఎక్కడా సామ్యంలేకుండా ఉన్నది. గౌరవనీయ కళా వెంకట రావుగారు మాట్లాడుతూ, సక్రమమైన సూచనలు చేయండి అని చెప్పారు. నిజమే సక్రమమైన సూచనలు ఇవ్వండని వారు ఆ రకంగా కోరడం చాలా సంతోషము. కాని, ఇదివరకు అనేకసార్లు అనేక సందర్భాలలో మాట్లాడుతూ ఉన్నామంటె, సక్రమమైన సూచనలు తెలియకనా? నేను ఒక విషయము చెప్పుతున్నాను. ఈ రైతాంగాన్నందరిని బేదఖలు చేస్తూఉంటే, మనం చట్టాలు తీసుకవస్తామని రైతాంగము యొక్క పరిస్థితి బాగుచేస్తామని చెప్పుతూ ఆలోచించకుండా కూర్చొన్నట్లైతే ఈ బినామీ పట్టాలన్నీ ఇట్లాగే ఖాయంగా జరిగిపోతె, తరువాత మనం భూసంస్కరణలు ఎవరికొరకు చేస్తాము? అందుకోసం భూసంస్కరణ గురించి ఆలోచించేటటువంటి మన మంత్రిగారు, మన అసెంబ్లీ కూడా ఒక నిర్ణయంచేయాలి. ఈ చట్టము తీసుకవచ్చిన నాటినుంచి, ఇదివరలో ఏరైతులైతే బేదఖలు చేయబడ్డారో, తొలగింప బడ్డారో, తొలగింపబడిన భూములలో బినామీ పట్టాలు సృష్టించబడినాయో, అవన్నీ కూడా రద్దు చేయాలని నాయొక్క సూచన. ఆతావాటిని రద్దుచేసినపుడే ఆ భూమిమీద తరతరాలుగా ఉన్న రైతాంగానికి కొంతవరకు హక్కు కలిగించినట్లు అవుతుంది. జమీందార్లకు ఎంత ఉండాలి,

వారికి ఎంత ఆదాయం ఉండాలి, ఆదివారికి సరిపోతుందా లేదా, వారి పిల్లలు హైదరాబాదులో కూర్చొని 2 వందలు, 3 వందలు ఖర్చుచేసుకొంటూ చదవడానికి సరిపోతుందా లేదా అనే విషయం అప్పుడు ఆలోచించుకొందాము. కాని, మొట్టమొదట 60, 70 సంవత్సరాలుగా ఉన్నటువంటి వాళ్ళకు అసలు రక్షణ కల్పించాలని నేను కోరుతున్నాను.

అలాగే ఈనాడు హుజూరునగర్ తాలూకాలో సోమనాదిగూడెం అనే ఊరు ఉన్నది. 70, 80 సంవత్సరములనాడు, అక్కడ రైతాంగమంతా చెట్లుకొట్టి పొదుకొట్టి, ఇళ్ళు కట్టుకొని నివాస మేర్పరచుకొని ఆ ఊరునిర్మించి అప్పటినుంచి కూడా ఆభూములు సాగుచేసుకొంటున్నారు. కాని ఎక్కడనుంచో వచ్చినటువంటి శాస్త్రిగారు అనే ఎవరో శ్రోత్రియందారు, ఆయనపేర అవి బంజరు భూములుగా మార్చి ఆయనకు 9 వేల ఎకరాల పట్టా ఇవ్వబడింది. కౌలుదారీ చట్టము ప్రకారం, ఆరైతాంగానికి, వారికి ఉండవలసిన **Rights** లేకుండా చేస్తూ అక్కడ ఆ పెద్దవారికి ఉన్న పలుకుబడిని ఉపయోగించి ఆరైతాంగానిని ఈనాడు కోర్టుల పాలు చేస్తున్నారు. కనుక 70 సంవత్సరములుగా ఆ ఊరునిర్మించుకొని, ఇదినాది అని చెప్పుకొని అన్నివిధాలా అనుభవిస్తున్నటువంటి ఆ రైతాంగానికి ఈ చట్టమువల్ల ఉపయోగము లేకుండా పోయింది అనే విషయం మీ దృష్టి కి తీసుకువస్తున్నాను ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం గమనించాలి. తెలంగాణాలో గ్రామాధికారులు ఈ పెద్దపెద్ద భూస్వాముల కుటుంబాలకు చెందో, లేక వాళ్ళ ప్రభావములో ఉండో, సరియైన **Record** లేకపోవడం వల్లనో, వాస్తవంగా భూయాజమాన్యం రైతుల చేతుల్లో ఉన్నదనేందుకు వారికి సరియైన **Record** లేకపోవడంచేతనో, ఆ **Records** సంపాదించేటటువంటి శక్తి, అంత విజ్ఞానం ప్రస్తుతం ఇక్కడ రైతాంగానికి లోపించడంవల్లనో, వీటన్నింటి ఫలితంగా కూడ, ఈ రాగితాలకూ ఆచరణకు అందకుండా ఉన్నదనే విషయం మనము దృష్టి లోపెట్టుకొని న్యాయంగా ఈ సంస్కరణలు అమలు పరచేందుకు కృషిచేయాలని నేను మనవి చేస్తున్నాను.

ఇక పోతే వ్యవసాయ కూలీల సమస్య వున్నది ముఖ్యంగా తెలంగాణాలో చూచినట్లయితే కుంట, సెంటు, కూడా లేనటువంటి హరిజనులు 10, 12 సంవత్సరాలుగా పాడుపడినటువంటి బంజరు భూములను బాగుచేసుకుంటున్నారు. వాటిని తావుని భూములని, పోరంబోకులని దారుణి కిత్తలని, బంచరాయిలని అంటారు. ఈ భూములను వారు సాగు చేసుకునే సందర్భంలో వారు అనేక కష్టనష్టాలకు గురి అయిన సంగతి ఇక్కడ మంత్రిగారికిని, కాంగ్రెసు నాయకులకు తెలుసు కాని వారికి ఈనాడు పట్టా హక్కులు లేవు. సంవత్సరంలో మొత్తం మీద 4 నెలలో మాత్రం పని దొరికేటటువంటి వ్యవసాయ కూలీలకు, ఈ సంస్కరణ ప్రకారం కొంత భూమిఇస్తే అది వారి జీవనానికి చేదోడు వాదోడుగా ఉంటుందని మనము అనేక సార్లు ఉపన్యాసాలులో మాత్రం చెప్పుతున్నాము, కాని ఆచరణలో ఏమీ చేయడం లేదు. వారికి ఈనాటి వరకు సక్రమంగా పట్టాలు చెందకపోవడమంటే చాల విచారకరంగా ఉన్నది. ఆ పేద ప్రజానీకం ఈనాడు అనేక ఇబ్బందులకు గురి అవుతున్నారు. వారిమీద రూపాయికి 10 రూపాయల చొప్పున **Penalties** వేస్తూఉంటే దానికోసం పైరవీ చేసుకోలేక, ఆ పైరవీ వ్యవహారాలు తెలియక ఎంతోమందీ పైరవుదారుల, మధ్య దళారీల చేతులలో చిక్కుకొని కష్టపడుతున్నారు. ఇటువంటి ఉదాహరణలు అనేకములున్నాయి. అవన్నీ ఇక్కడ చెప్పుటకు ఇది సందర్భంకాదు. కనుక ఇలాంటి

పరిస్థితులలో ఇటువంటి బిల్లు ఈవేళ తీసుకురావలసిన అవసరం శంకరయ్యగారికి లేదని చెప్పడం సరికాదు. వాస్తవంగా చాలాకాలం వరకు, చర్చలు జరుగుతున్నటువంటి విషయమిది, ఈ చర్చలు చర్చలుగానే ఉండకూడదు. ఆచరణగా కూడావుండాలి. కనుక కళావెంకటరావుగారు చెప్పినట్లు సక్రమమైన సూచనలను స్వీకరించి, భూసంస్కరణలెవో వస్తాయనే భయంతో గ్రామాలలో భూస్వాములు సాగిస్తున్నటువంటి ఈ అక్రమాలను అరికట్టడానికి పూనుకొంటారని ఆశిస్తూ నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞతాభివందనములు తెలుపుతూ సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ కె. పున్నయ్య: (చీపురుపల్లి)—అధ్యక్షా, భూసంస్కరణను తొందరగా తీసుకు రావడానికి ప్రభుత్వము కృషిజేస్తున్నందుకు సంతోషము అందుకు నా అభినందన తెలియజేస్తున్నాను. ముఖ్యంగా మన ముఖ్యమంత్రిగారు ఈ విషయమై చాలా శ్రద్ధ తీసుకుని రాష్ట్ర ప్రజాభిప్రాయాన్ని కూడ దృష్టిలో పెట్టుకుని తొందరగా భూసంస్కరణలు తీసుకు రావాలని అవసరమైన కృషి చేస్తున్నందుకు కూడ సంతోషంగా ఉన్నది. భూ సంస్కరణలంటే రైతులలో Peasant proprietorship కు వ్యతిరేక విధానం మాత్రం కాదని తెలియజేస్తున్నాను. సాధారణంగా భూసంస్కరణలు అని మాటోటివారు చెప్పినప్పుడు, వాళ్ళు ఎవరో రైతులకు వ్యతిరేకులని రైతాంగ విధానానికి శత్రువులని ఏ పరిస్థితులలోను పొరపాటు పడకూడదని మనవి చేస్తున్నాను. మేముకూడ భూసంస్కరణ కావాలని చెప్పేడివాళ్ళమే, రైతులను బలపరచేడి వాళ్ళమే, Peasant proprietorship ను కాంక్షించు నటువంటి వాళ్ళమే. అని మనమిత్రులు గుర్తుంచుకోవాలని నేను కోరుతున్నాను. అందుచేత భూ సంస్కరణలు అంటే ఎవరో, ఏదో రైతులందరిని కూడా నాశనం చేసేటటువంటి వర్గంగా తయారైందని ఏవిధంగాను పొరపాటు పడకూడదని నేను కోరుతున్నాను.

కాంగ్రేసు గత సంవత్సరము నుంచి కూడ భూ సంస్కరణలగురించి కృషిచేస్తూ ఉన్నదని మనకుతెలుసు. తొందరగా భూసంస్కరణలు తీసుకరావలనే అభిప్రాయముతో కుమారప్ప గారి కమిటీని నియమించింది. 1942 Quit India తీర్మానంలో కూడా ఈ విషయం ఉద్ఘాటించబడియున్నది. "Tiller of the soil must be owner of the land" అనేవిషయం Quit India తీర్మానంలో ఉద్ఘాటించబడినది. ఆరోజునుంచికూడ దేశం అంతట స్వాతంత్ర్య ఉద్యమంతో బాటు, భూసంస్కరణలు కావాలనే ఉద్యమంకూడా ప్రచారం గావించబడియున్నది. అందుకు దేశం సంసిద్ధంగా ఉన్నది. ప్రభుత్వం చిత్తశుద్ధితో తొందరగా భూసంస్కరణలు తీసుకురావాలని ప్రయత్నంచేస్తుంటే రైతులయొక్క అభిమానులు అనే పేరుతో భూస్వాములు అనేవారు యింకా కాలయాపనకు ప్రయత్నించుట మంచిదికాదు. మన లక్ష్మణదాసుగారు చెప్పిన పంచసూత్రముల విధానం అందరికీ కావాలని కోరుతున్నాం. మేము కూడా రైతు విధానానికి సంబంధించిన వాళ్ళమే. రైతులకు ముఖ్యంగా వ్యవసాయోత్పత్తికి ఆహారోత్పత్తికి నీటి సదుపాయాలు, Credit facilities యింకా యితర సౌకర్యాలు, కావాలి. భూస్వామ్య విధానం పనికిరాదని చెప్పుతున్నామేగాని రైతువిధానం పనికి రాదని మేము చెప్పటలేదు. land reforms రావాలని, భూములకు సీలింగ్ పెట్టాలని చెప్పుతున్నాము. వందలు, వేలకొలది కలిగిన భూస్వాములు, యిష్టంవచ్చినట్లుగా దౌర్జన్య పద్ధతులలో రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా ప్రయత్నంచేయుట మంచిదికాదు. ఈ భూసంస్కరణల విధానానికి వ్యతిరేకంగా కరడుకట్టిన భూస్వాములు తిష్ట వేసుకు కూర్చొన

కూడదని, సాంఘిక విప్లవానికి, ప్రజాభిప్రాయానికి అనుగుణ్యంగా మార్పు చెందాలని మేము విజ్ఞప్తి చేస్తున్న విషయం మన మిత్రులు గుర్తించాలని మనవి చేస్తున్నాను. కమతాలయొక్క పరిమితి ఏ విధంగా ఉండాలి అనే సందర్భంలో ప్లానింగ్ కమిషన్ చెప్పి ఉన్నది. ప్లానింగ్ కమిషన్ చెప్పిన అభిప్రాయం ఏమంటే Economic unit, ఫామిలీయూనిట్ తీసుకొని అందుకు మూడు రెట్లుగా ఏర్పాటు చేయమని సూచనగా చెప్పినట్లు మాకిచ్చిన ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పుస్తకములో ఉన్నది. దేశం అంతట ఉన్న కమతాలు బహుకొద్ది భాగం పెద్ద పెద్ద కమతాలనే విషయం ఎల్లరూ ఎరిగినదే. ఈ విషయం దృష్ట్యా 5 గురు సభ్యులతో కూడిన కుటుంబానికి కనీసం ఎంత ఉండాలనే సూచనకు, అందుకు మూడు రెట్లు గరిష్ట పరిమితిగా నిర్ణయించేసినట్లు సిఫార్సు చేయబడిన విషయంతో నేను కూడా ఏకీభవిస్తున్నాను. మరొక అభిప్రాయం ప్రచారంలో ఉన్నది. సెంట్రల్ డిస్ట్రిక్ట్సులో ఉన్న భూమి విలువ పేరు, అక్కడ పంటల విలువ పేరు, అల్లాగే శ్రీకాకుళంజిల్లాలో, మెట్ట ప్రాంతాలలో ఉన్న భూముల వ్యవహారం పేరు, అందువల్ల సీలింగ్ ఏ విధంగా పెట్టాలనే సమస్య ఉన్నది. దానికి ప్లానింగ్ కమిషన్‌వారే సమాధానం చెప్పినట్లు భావించుకోవాలి. ఎందుకంటే family unit పెట్టుకొని దానికి మూడు రెట్లు చేసుకుంటే సులువైన పద్ధతిలో ఈ విషయం అమలు చేసుకొనుటకు అవకాశం ఉంటుంది. Difficulties ఉంటే సర్దుబాటు చేసుకొనవచ్చును. ఈ పేరుతో భూసంస్కరణలు కూడదని, వ్యవసాయ ఉత్పత్తి కుంటుపడుతుందని, ఆ విధమైన అభిప్రాయం మాత్రం తెలియజేయరాదు. ట్రాన్సుఫర్సు విషయంలో అనేక విధాలుగా జరుగుతున్నటువంటి విషయం వాస్తవమే. ఆ విధానాన్ని అరికట్టాలి. అయితే Joint families ఉన్నాయి. మనకున్న laws ప్రకారం Joint families—Separate కావచ్చును. Separate అయినప్పుడు వారికున్న Inheritence rights Protect చేసుకుంటూ, ఈ ఇనామీ, లక అసందర్భ transfers అరికటాలనే అభిప్రాయం తెలియజేస్తున్నాను.

రెండవ వాదమేమంటే పెద్దపెద్ద పట్టణాల్లో అనేకమైన బిల్డింగ్సు కలిగి ఉన్నారు; బ్యాంకులలో డబ్బు కలిగి ఉన్నారు. వాటన్నింటిపైన సీలింగ్ పెట్టకుండా భూములపైన సీలింగ్ పెట్టడం ఏమిటి అనే వితండ అభిప్రాయం ఈ మధ్యనే మన రాష్ట్రంలో బయలుదేరింది. బిల్డింగ్సు విషయంలోగాని, బ్యాంక్సులో ఉండే డబ్బు విషయంలోగాని సీలింగ్ పెట్టాలనే విధానంతో ఏకీభవిస్తాను, కాని అది జరిగేవరకు భూసంస్కరణలు చేయరాదనే అభిప్రాయంతో నేను ఏకీభవించను. ఇవన్నీ అనుకునే జమీందారీ abolition పెట్టామా? ఇవన్నీ ఆలోచించే ఈనాముల abolition పెట్టామా? టెనెన్సీ Act పెట్టామా? అదే విధంగా భూసంస్కరణలు కూడా ఒక పద్ధతిలో ప్రారంభించాలి. దేశం పురోగమించాలి. దాని తరువాత urban Properties విషయం ఆలోచించాలికాని అంత వరకు భూసంస్కరణలు ఆగాలనే దానితో నేను ఏకీభవించజాలను. Agrarian reforms ముందుగా తీసుకురావాలని నేను వినయ పూర్వకంగా మనవి చేసుకొంటున్నాను.

సాధారణమైనటువంటి వ్యవసాయ కూలీలకు, 2 ఎకరాలు, 3 ఎకరాలు వచ్చినంత మాత్రాన Co-operative agriculture ద్వారా అభివృద్ధి చెందగలరనే అభిప్రాయం తెలియజేసి

ఉన్నాం. రెండుమూడు ఎకరాలు వచ్చినవారినందరినీ సంఘటిత పరచి Co-operative agriculture చేయిస్తే మనం అనుకున్న socialistic Pattern of society వెంటనే అమలుపరచటానికి అవకాశం ఉంటుంది. కాని వారందరూ, భూములు అప్పేస్తారు అనే అభిప్రాయం వితండవాదమేగాని, చిత్తశుద్ధితో కూడుకొన్న అభిప్రాయం కాదని మనవి చేస్తున్నాను. భూ సంస్కరణల విషయమై ఏ మాత్రం వ్యతిరేకభావం ఉండరాదని మనవి చేస్తున్నాను. మనం ఎలెక్షన్ ప్రచారం సందర్భములో socialistic Pattern of society కావలెనని చెప్పుతున్నాము. అందుకు అనుగుణ్యంగా land reforms వెంటనే తేవాలని కోరుతున్నాను. అందువలన వ్యవసాయ విధానం కుంటుపడుతుందని చెప్పటం న్యాయంకాదు. (హర్షం) అందుచేత socialistic pattern of society అంటే land reforms—Measure rod గా ఉండాలని నా అభిప్రాయం. అందుకు అఖిలభారత కాంగ్రెసుకమిటీ, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ, చీఫ్‌మినిస్టరుగారు త్వరపడి ఈ అభిప్రాయం దృష్టిలో పెట్టుకొని ఈ సిద్ధాంతానికి అనుగుణంగా land reforms తొందరగా తీసుకు రావాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

శ్రీ భీమారెడ్డి నరసింహారెడ్డి: (సూర్యాపేట)—అధ్యక్షా, గౌరవనీయ సభ్యులైన లక్ష్మణదాసుగారు చేసిన ఉపన్యాసం గురించి యీ సమస్య స్పష్టతకోసం కొన్ని అభిప్రాయాలు వెల్లడించుట అవసరమని అనుకొంటున్నాను. లక్ష్మణదాసుగారు చాలా దీర్ఘోపన్యాసం ఇసూ మాటకు మాత్రం, భూసంస్కరణలయొక్క అవసరం తాముకూడా గుర్తిస్తున్నామని చెప్పారు. కాని వారి ఉపన్యాసంలో ఈ చివరినుంచి ఆ చివరివరకు భూ సంస్కరణలకన్నా రైతుకు మొట్ట మొదట మార్కెటింగ్ సౌకర్యాలు కావాలని నీటి వనరుల సౌకర్యాలు కావాలని, తదితర అనేక సౌకర్యాలు—విద్య, వైజ్ఞానిక సౌకర్యాలు కావాలని చెప్పారు. అటువంటి సౌకర్యాలన్నీ కావాలంటూ వాటిని భూసంస్కరణలకు కృత్రిమంగాపోటీపెట్టి అసలు సమస్యను గందరగోళం చేయటానికి వారు ప్రయత్నించారని ఈ సభవారికి మనవి చేయదలచుకున్నాను.

ఎందుకంటే, ఒక్క విషయము మాత్రము స్పష్టము చేయవలసియున్నది. ఈనాడు భూసంస్కరణలను తీసుకొనివచ్చి ప్రవేశపెట్టడమనేది అటు ఉంచి, తక్కిన సౌకర్యాలను అభివృద్ధి చేయమని అడగడమనేది, ఎట్లా ఉన్నదంటే గుర్రమును వెనుకకు పెట్టి బండిని ముందు పెట్టినట్లుగా ఉన్నది. వారు అడిగిన మార్కెటు సౌకర్యాలుగాని, వారు చెప్పిన నీటి సౌకర్యాలుగాని యింక యితర సౌకర్యాలు అంటే, వారు అడిగిన వైద్య, వైజ్ఞానిక సౌకర్యాలకన్నింటికిని కీలకస్థానము అయిన భూసంస్కరణలను తీసుకుని రాకుండా, తద్వారా అధిక సంఖ్యాకులుగా ఉన్న రైతులో —నికి భూమిని అందకుండా చేస్తున్నారు. ఈనాడు భూమి మీద ఆధారపడి ఉన్న వారికి భూమిని అందనివ్వకుండా చేస్తున్న భూస్వాముల యొక్క ప్రాబల్యము అంతరించకుండా చేస్తున్నారు ఈ విధముగా చేయడము వల్ల రైతాంగము యొక్క ఆర్థిక పరిస్థితులు పెంపొందగలవని వారు భావిస్తున్నారా? అట్లా భావిస్తే భూ సంస్కరణలు రావడమనేది అపోహ భ్రమయేనని చెప్పక తప్పదు. భూసంస్కరణలను గురించి ఆలోచిస్తున్నాము, ప్రవేశ పెట్టబోతున్నాము అని చెబుతూ, ఏదో ఒక సాకుతో కాలయాపన చేస్తున్నది ఈ ప్రభుత్వము. వాటిని ప్రవేశించ బెట్టనివ్వకుండా సూటిగా వ్యతిరేకించకపోయినను మరొక విధముగా అడ్డు తగలడము కన్పిస్తున్నది.

ఇది ప్రభుత్వ పక్షములో పరిపాటిగా కనబడుతున్నది. వాస్తవానికి భూసంస్కరణలను సూటిగా ఎవరు కూడ వ్యతిరేకించరు. భూ సంస్కరణలు ప్రవేశపెట్టడమనేది చారిత్రాత్మకము అయింది. భూ సంస్కరణలు రానివ్వకుండా కమ్యూనిస్టులు వ్యతిరేకిస్తున్నారని చెప్పడం ఇందులోనికి కమ్యూనిష్టుల పేర్లు తీసుకుని రావడము తరచు కనబడుతున్నది.

ఈ భూసంస్కరణలు రానివ్వకుండా చేసేది నిజముగా కమ్యూనిస్టులు కాదు. ఈ సత్యమును గుర్తించడము అవసరము. వారిమీద యీ నెపము వేయడము సమంజసము కాదు. చరిత్ర యీ సమస్యను ముందుకు తోస్తున్నది. ఇది జాతీయ అవసరముగా ఏర్పడిన సమస్య. ఈ విషయము అన్ని పార్టీలు గుర్తించినవి. మనము Socialistic pattern of Society ను ఆచరణలోనికి తెచ్చుకోవాలని గత ఆవడీ కాంగ్రెసు మహాసభ నిర్ణయించినది. Socialistic pattern of Society ఏర్పరుచుకోటాని కీలకస్థానము ఏది అనేది గుర్తించవలసినది ఏమి టంటే ఆర్థికరంగములో ఉన్న కొద్దిమందికి ప్రాబల్యా పెట్టుబడిదార్లకుగాని, భూస్వాములకుగాని ముకాకుండా చేయడమనేది Socialistic pattern of Society యొక్క ముఖ్యాంశము. ఇది అందరము గుర్తించాము. భూస్వాములయొక్క ప్రాబల్యము తగ్గించకుండా రైతులోకాన్ని ఆర్థికముగా చక్కబరచేది ఏ విధముగా జరుగగలదు. అని నేను ప్రభుత్వాన్ని అడుగుతున్నాను ఈనాటి అనుభవమునుబట్టి దొడ్డా నరసయ్యగారు మా జిల్లాలో ఒక నియోజకవర్గమునుంచి వచ్చినవారు. గత చట్టము క్రింద భూముల ఏ విధముగా బేదఖలు జరుగుచూవచ్చినవో, ఆ చట్టముయొక్క ఆశయము ఏ విధముగా ఉన్నదో అది ఏవిధముగా విఫలము అయినదో కూడ వారు స్పష్టముచేశారు. నేను కేవలము వారి రిపోర్టుమీద ఆధారముచేసుకుని చెప్పడములేదు. ఇదివరకు హైదరాబాదు ప్రభుత్వమువారి రిపోర్టును ప్రకటించినది. ఆరోజులలో ఆ చట్టము చేయడములో మొట్టమొదట హైదరాబాదు స్టేటులో దాదాపు నూటికి 70 వంతులు కౌలుకు చేస్తున్న భూములు బేదఖలు చేయడము జరిగింది. ఇది వాస్తవమును బైటపెట్టిన రిపోర్టుగనుక, నేను దానిని స్వయముగా అంగీకరించాను. తెలంగాణములో నూటికి 47 వంతులు భూములుబేదఖలు అయినవన్న సంగతి కూడ ఆ రిపోర్టు అంగీకరించింది. ఆ చట్టములోఉన్న లొసుగులను ఆధారం చేసుకొని భూములు బేదఖలుచేశారని ప్లానింగు కమిషనువారు గుర్తించారు. అనేకమంది భూస్వాములు resumption అనే పేరుతోగాని, కాని వారికి ఉన్న అనుకూల పరిస్థితులను బట్టిగాని కౌలుదార్లు చేసుకుంటున్న భూములను బేదఖలుచేయగలిగారని స్పష్టముగా తెలియజెప్పింది. • అందువల్ల ఆచట్టము ఒక రకముగా విఫలమయిందని స్పష్టపడింది. భూసంస్కరణలు అని మనము అనుకుంటున్నప్పుడు, ఆ చట్టములో చేర్చవలసినవి కొన్ని ముఖ్య హాంశములు అందులోలేవు. దానిలో రైతు లోకానికి అత్యధిక భాగముగా భూమి అందజేయడము అతి ముఖ్యమైన విషయమైనప్పటికినీ, అది మాత్రము ఆ చట్టములో జరగలేదు. భూమిని రైతు కూలీలకు పంచడమనేది జరగలేదు. అ ఆశయమే విఫలమయిపోయింది. ఆ చట్టములో భూమి పంపిణీ విషయము ఇమిడి పోనందువల్ల, దానిని అధికారులు అమలు జరపడమనేది వచ్చినప్పుడు, ఆచట్టము యొక్క ప్రయోజనములు రైతులకు అందలేదు. అది అందరికీ తెలిసిన విషయమే. అంతే కాకుండా కౌలుదార్ల సమస్య మరొక ముఖ్యమైన సమస్యగా ఉన్నది.

కౌలుదార్ల యొక్క హక్కులు, వారి కష్టాలను రక్షించుకోవడమనే సమస్య అది. ఆ విషయము చూచినప్పుడు అది విఫలమయిందని ప్రభుత్వముయొక్క రిపోర్టే స్పష్టపరుస్తున్నది. తెలంగాణాలో నూటికి దాదాపు 47 వంతులు, హైదరాబాదు స్టేటులో 75 వంతులు భూములు కౌలుదార్ల వద్దనున్న భూములను బేదఖలుచేశారు. ఈ విధముగా చేయడమువల్ల కౌలుదార్ల హక్కులను ఏ విధముగా కాపాడినట్లయింది? కౌలుదార్ల హక్కులను కాపాడకుండా ఉన్నంతవరకు అది వాస్తవానికి భూసంస్కరణల చట్టము ఎట్లా అవుతుంది? అందులో ఉన్న Spirit ఎట్లా కాపాడినట్లవుతుంది? చిట్టచివరకు భూములను resume చేసే విషయము తీసుకుంటే స్వంత సేద్యమనే సాకుతెచ్చిపెట్టుతున్నారు. ప్రతి భూస్వామి కూడ మూడు కుటుంబముల కమతాల పరిమితివరకు భూములను స్వంత సేద్యములో ఉంచుకోవచ్చునని అందులో పేర్కొనబడింది. కాని అందుకు భిన్నముగా భూస్వాములు భూమిని ఉంచుకొని ఉన్నారు. అది స్వంత సేద్యము అని గాని మరే కారణముతో భూమినంతను తీసుకోవాలనిగాని ఈ విధమైన పట్టుదల భూస్వాములలోఉన్నది. ఈ పట్టును సడలింపజేయటానికి వీలు కాకుండాఉన్న చట్టములేని లోపములవల్ల, వీలు లేకపోయింది. ఈ ప్రధానాంశముల మీద అంటే రైతు కూలీలకు భూములను resumption అనే పేరుతో అధికంగా భూమిని తీసుకోకుండా ఒక కుటుంబమునకు సరిపడిన భూపరిమితిని మాత్రమే తీసుకుంటానికి Planning Commission వారు సూచనలు కొంతవరకైనా తోడ్పడి నవి. ఈనాడు మన మిత్రులు లక్ష్మణదాసుగారికి నేను మనవిచేసేది ఏమిటంటే, వారికి నా జవాబు అక్కరలేదు. planning commission వారి రిపోర్టు ద్వారా చట్టము విఫలమయిందని స్పష్టముగా నిదర్శనమయింది. ఇంతకంటె వేరే నిదర్శనము ఏది కావాలి గత చట్టము సరిపోలేదు. నేటి చరిత్రాత్మకమైన అవసరములకు భూసంస్కరణలు చేసి రైతాంగ మును కాపాడటానికి, గత చట్టము సరిపోదు గనుక మరొక చట్టము అవసరమవుతున్నది. అది మాత్రము ప్రభుత్వముచేస్తే సరిపోతుంది. ఆ కారణములచేత బి. శంకరయ్యగారు ఆ తీర్మానాని తీసుకువచ్చారంటే, అందులో ముఖ్యంగా అధికభాగము రైతాంగానికి అందజేయటానికే తెచ్చారు. దానివల్ల భూస్వాముల పట్టును సడలించటానికి వీలుఅవుతుంది. లక్ష్మణదాసుగారు ఏ మార్కెటు సౌకర్యాలు అయితే కోరుతున్నారో, ఆ మార్కెటుకు కావలసిన కొనుగోలు శక్తిని అధికసంఖ్యా కులుగా ఉన్న రైతాంగానికి, ప్లానింగు కమీషను సూచనల ప్రకారము పెంపొందింపజేయటానికి ఒక బిల్లును వెంటనే తీసుకుని రావాలని కోరుతున్నాను. లక్ష్మణదాసుగారు మార్కెటు సౌకర్యాలు కావాలని కోరుతున్నప్పుడు, అధికసంఖ్యాకులకు కొనుగోలు శక్తిలేనప్పుడు, మార్కెటు సౌకర్యాలు ఉండేది ఎట్లా? అవి జరిగేది ఎట్లా? అది పెరిగేది ఎట్లా అని నేను చాలా అమాయకముగా ప్రశ్నిస్తున్నాను.

శ్రీ కె. వెంకటరావుగారు.—ఇద్దరు కూడ అమాయకులు కారు.

శ్రీ బి. నరసింహారెడ్డి.—వెంకటార్యవుగారు చెప్పినది నాకు వినపడలేదు.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్.—ఈ యిద్దరిలో అమాయకులు ఎవరూ కాదు అని వెంకటార్యవు గారు అంటున్నారు.

శ్రీ బి. నరసింహారెడ్డి.—ప్లానింగు కమిషనువారు బేదఖలు అయిన భూములను receive చేయవలసిందని సలహా యిచ్చిన రిపోర్టుఉన్నది. ఆ ప్రకారము అమలు జరపడానికి ఒక బిల్లు అవసరముగా కన్పిస్తున్నది. భూసంస్కరణల ద్వారా యీ భూములను review చేసే అవకాశములు ఉన్నవని శంకరయ్యగారి తీర్మానము సూచిస్తున్నది. దానిని నేను ఒక దృష్టిలో బలపరుస్తున్నాను. అయితే ఆ తీర్మానము అంత మాత్రముచేత ప్లానింగు కమిషను సూచనలు అన్నీ పూర్తిగా పరిష్కరించలేకపోవచ్చు. గాని గత చట్టములో ఉన్న లోటుపాటులు కొంత వరకైన సవరింపజేయవచ్చు. కాబట్టి యీ తీర్మానము ద్వారానైనా రైతాంగానికి కొంతవ కైనా సహాయపడుతుందన్ని ఉద్దేశ్యముతో నేను శంకరయ్యగారి తీర్మానమును బలపరుస్తున్నాను. ఈ విషయమును గురించి రైతాంగానికి కమ్యూనిస్టుల మీద విశ్వాసములేదనిగాని యింకా యితరత్రా గాని ఏ కారణములు అయితే పేర్కొనబడినవో, వాటికి పెద్దగా ప్రాముఖ్యత యివ్వనవసరము లేదని నేను చెప్పకపోయినను, క్లుప్తముగా ఒక విషయము మాత్రము మనవిచేసి ఊరకుంటే మంచి దని నేను అనుకుంటాను ఎందుకంటే భూస్వాముల పట్టు తొలగించటానికి వ్యతిరేకిస్తున్న లక్ష్మణదాసుగారు, భూసంస్కరణలను సూటిగా వ్యతిరేకించకపోయినను, దాని కనుగుణమైన స్వభావమును, అభిప్రాయమును వెలిబుచ్చినటువంటివారు భూస్వాముల నుంచి భూములను పంచ కూడదు అనే పట్టుదల శ్రీవారికి ఎంత ఉన్నదో, పెద్ద రైతాంగానికి భూములను పంపిణీ చేయించాలనే పట్టుదల మాకు కూడ ఎంత ఉన్నదో వారు గుర్తించి, వారే జవాబు యిస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ యల్. లక్ష్మణదాసు.—On a point of personal explanation, Sir, నేనేదో భూసంస్కరణలను వ్యతిరేకిస్తున్నానని ప్రచారము చేయటానికి మాట్లాడుతున్నట్లు కనబడుతున్నది. కాని భూసంస్కరణలను గురించి ప్రభుత్వము ఎప్పటినుంచో ప్రయత్నము చేస్తున్నది. దానికిగాను ప్రభుత్వము అనేక దర్యాప్తులు చర్యలు తీసుకుంటున్నది. ఆంధ్ర రాష్ట్రములో ఉన్నప్పుడు ఆంధ్రకు Tenancy Act ను ప్రభుత్వము ప్యాసు చేసింది. అది ఆరు సంవత్సరాలవరకు Interruption.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్.—దానికితోడు మీ పంచసూత్రములు జతపరచండి.

శ్రీ యల్. లక్ష్మణదాసు.—అంతేకాకుండా యీ పంచసూత్రములు దృష్టిలో పెట్టుకుని యీ భూములను ఏ విధముగా పంచాలి అనే విషయములో ప్రభుత్వము కృషిచేస్తున్నది. ఈ విషయము నేను అందరితో మనవిచేశాను. అంతే కాని నేను భూసంస్కరణలను వ్యతిరేకించే ఉద్దేశ్యము మాత్రము నాకులేదు. ఆ ఉద్దేశ్యముతో నేను ఎప్పుడూ మాట్లాడలేదు. రైతుల యొక్క యదార్థ పరిస్థితులు గమనిస్తూ ఏరకముగా, ఏ విధానముతో భూములు ఒక్కొక్కరికి ఎంత ఉండాలి అని చెప్పటానికి బైటకు రండి అని నేను చెప్పానుగాని కేవలము యీ భూసంస్కరణలు అక్కరలేదని మాత్రము నేను చెప్పనేలేదు. భూసంస్కరణలను గురించి ప్రభుత్వము అప్పుడే ఒక decision తీసుకున్నది. వాటిని గురించి బిల్లు ఒకదానిని తయారు చేయటానికి ప్రయత్నిస్తున్నది. అటువంటి సందర్భములో యిప్పుడు యీ తీర్మానముయొక్క అవసరము ఎందుకు? దీనిని గురించి ప్రభుత్వము ఎలాగైనా చర్యతీసుకోబోతున్నదని మనవి చేస్తున్నాను. కాబట్టి నా మిత్రుడు నరసింహారెడ్డి నన్ను గురించి అపోహపడనక్కరలేదని మనవిచేసు న్నాను.

శ్రీ ఆర్. వి. వి. కృష్ణంరాజుబహదూరు (తుని) :—ఉపాధ్యక్షా, ఇంతవరకు నా మిత్రులు చాలా మంది యీ సభలో భూ సంస్కరణల విషయములో వారి వారి అభిప్రాయములను వెలిబుచ్చిన సందర్భములో, నేను కొన్ని విషయములు మాత్రము మనవిచేస్తున్నాను. కాని యీ రోజున మన వావిలాల గోపాలకృష్ణయ్యగారు భూసంస్కరణల విషయములో మాట్లాడిన విషయాలలో తప్ప, దాని విషయములు మాత్రము ప్రస్తుతానికి అది అంత సమంజసముగా లేదేమోనని నేను వ్యతిరేకిస్తున్నాను. గాని యధార్థముగా చూస్తే కాంగ్రెసు ప్రభుత్వము పరిపాలనలోనికి వచ్చిన లగాయతు ఎప్పటికప్పుడు ఈ సంస్కరణలను గురించి భోగట్టా సేకరిస్తూ ఏ రూపములో, ఏ స్థాయిలో యివి తేవాలనే విషయము అవసరమైనప్పుడు చర్చిస్తూ ప్లానింగు కమిషనువారి ద్వారా యింకా యితర రాష్ట్రములలో ఏ విధముగా యివి అమలు జరుగుతున్నవో ఆ భోగట్టా అంతా సేకరిస్తూ, ఆ రూపములో, ఆ స్థాయిలో చేస్తే ప్రజానుకూలత ఏర్పడుతుంది, అని ఆలోచించి తగు చర్యలు తీసుకుంటూన్నది. అందువల్ల కాలయాపన జరుగుచున్నదే కాని భూసంస్కరణలు తీసుకుని రాకూడదు అనే భావము ప్రభుత్వానికి ఎంత మాత్రము లేదని మాత్రము నేను మనవిచేస్తున్నాను. భూసంస్కరణలు తీసుకుని రాకూడదని కాంగ్రెసు పార్టీలో లేదని మాత్రము నేను ఖచ్చితముగా చెప్పగలను. అంతే కాకుండా కొద్ది రోజులలోనే భూసంస్కరణలు తేవాలనే ఉద్దేశ్యము గవర్నమెంటుకు ఎక్కువగా ఉన్నది. మొత్తం మీద దేశం యొక్క అన్ని రాజకీయ రంగాలలోను భూసంస్కరణలు అనే Chronic disease బైలుదేరింది. ఆ disease కు ఏదో ఒక విధంగా చికిత్స చేయకపోయినట్లయితే ప్రజానీకం mental గాను, physical గాను బాధపడుతారు. ప్రభుత్వము తగిన చికిత్సనివ్వడానికిగాను ఇతర రాజ్యాలు, చైనా వగైరా దేశాలకు పంపించి committee లను appoint చేయించి ఏఏ దేశాలలో ఏ విధంగా భూసంస్కరణలు చేయబడ్డాయో, అది కొలది కాలంలోనే ఏ విధంగా విఫలం అయినాయో, మళ్లీ తిరిగి ఏ స్థాయిలో చేస్తున్నారో మొదలైన విషయాలన్నీ తెలుసుకుని అన్ని ప్రాంతాలయొక్క అభిప్రాయాలను తెలుసుకొని, ఏప్పైన భూసంస్కరణలు చేశామంటే కొన్ని వందల సంవత్సరాల పాటు సుస్థిరంగా సాగిపోయేటట్లు ఉండాలని గవర్నమెంటు నిరీక్షిస్తున్నదే కాని అంతకంటే మరేమిలేదు. Election propaganda లో ఏదో చెప్పి, తీరా House లోనికి రాబోయేసరికి, పరిపాలన నిర్వహణ హస్తగతం కాబోయేసరికి, వేరే ఏవో అభిప్రాయాలు పెట్టుకుని నివురుగప్పిన నిప్పులాగా చూస్తూఉండే ఉద్దేశ్యంతో మాట్లాడడం చాలశోచనీయమని తమ ద్వారా సభ్యులకు తెలియజేస్తున్నాను. Family economic holdings అని చెప్పారు. దానికి twice ఇచ్చినా thrice ఇచ్చినా మాకేమీ అభ్యంతరం లేదని Planning Commission వారు చెప్పారని కొంతమంది సభ్యులు చెప్పారు. కాని ఒక్క విషయము మాత్రము సభవారికి తమ ద్వారా మనవిచేస్తున్నాను. మనదేశంలో మన ప్రాంతంమటుకు మితాక్షరి Law ప్రకారంగానే ఇంతవరకు అమలు జరుగుతూఉన్నది. అని మాత్రము మరచిపోకూడదు.

మితాక్షర Law ప్రకారంగా ఒక పురుషుడికి స్త్రీకి జనించిన సంతానం విషయంలో, ఎప్పుడైతే Male issue పుట్టాడో పుట్టిన ఉత్తర క్షణంలోనే సదరు ఆస్తికి హక్కుదారుడనే విషయం మరచిపోకూడదు. ఈ లోపల కొన్నికారణాలవల

పంచుకొన్నప్పటికీ, తల్లి గర్భవతి అయిఉండి, ఆరుమాసాలు దాటిన తరువాత ఈ partition జరిగినట్లయితే తదుపరి పుత్రసంతానం కలిగినట్లయితే ఆ పుత్రుడు ఆ property కి హక్కుదారుడు అనే విషయం మరచిపోకూడదు.' ఇప్పటికీ కూడా మితాక్షరి (                ) అమలులో ఉన్నదనే విషయం గుర్తులో పెట్టుకోవాలి.

భారతదేశం వ్యవసాయికదేశమని చరిత్రచెప్పుతూఉన్నది. ఈనాడు జపానునుండి, చైనా అనండి ఎక్కడ వ్యవసాయం అగ్రస్థానం వహించినప్పటికి దానికి నాంది భారతదేశమని మరచిపోకూడదు. దానిని మన గర్వకారణంగా చెప్పకోవాలి. అందువలన ఈ దేశంలో పుట్టే ప్రతి భారతీయుడు కూడ వ్యవసాయదారుడనే గుర్తు ఉంచుకోవాలని చరిత్ర చెప్పుతున్నది మనదేశం యొక్క సాంప్రదాయం ఏమిటంటే వజ్రవైఢూర్యాలలో ఎన్ని లక్షలు ఆస్తి గడించినప్పటికీ, పనికిమాలిన పోరంబోకు ఏ 5 ఎకరాలో ఉంటే నిర్యాణమయ్యే ముందు దీనిని స్థిరాస్తి అని, దానిని చరాస్తి అని విల్లులో వ్రాస్తాడు. దీనిని ఎందువల్ల చరాస్తిఅన్నారు అంటే ఒక పురుషుడు అంతరించిన తరువాత అతని సంతానం ఏ society లోనో, లేక రాజకీయాలలో ఉద్రేకపూరితమైనటువంటి పరిణామాలలో పడిపోయి తన ఆస్తిని తక్కువ time లోనే పోగొట్టుకొనే అవకాశం ఉన్నది. కాని స్థిరమైన భూమి విషయంలో కొంత వ్యవధి, కొంత కార్యక్రమం ఉన్నది. అందుచేతనే దీనిని స్థిరాస్తి అని దానిని చరాస్తి అని అంటారు.

ఒక ఉద్యోగికాని, భూస్వామికాని, రైతుగాని ఎవరైన సరే తనయొక్క స్వయం కృషివల్ల కొంత ఆస్తిని సంపాదించి, వెంటనే ప్రక్కన ఉండే భూములను వెయ్యి 2 వేలు 3 వేలుపెట్టి అయినా దానిని కొనుక్కొని స్థిరంచేయాలన్న ఉద్దేశ్యమే ఈనాటివరకు దేశవ్యాప్తంగాఅమలుజరుగుచున్నది. ఆ విధంగా అప కష్టాలుపడి సాగుచేసుకొనే పరిస్థితులలో, economic holding అని చెప్పి భూమిని పంచండి, పంచండి అని చెప్పడం చూస్తే, నా మిత్రులు ఉచితార్థంగా పంచుకోవచ్చుననే ఆశతో ఈ విధంగానెలవిస్తున్నారుగాని యథార్థంగా మీ కోర్కెలు ఈడేరవని నొక్కిచెబుతున్నాను. మనయొక్క ఆర్థికపరిస్థితినిబట్టి constitution లోని Article (31) ప్రకారం ఇవ్వాలని చెప్పారు. article (31)ను amend చేసిపెట్టినప్పటికి కూడా ఏదైనా కొంత compensation ఇవ్వకుండా ఏమిచేయడానికి వీలులేదనే విషయం అందరికి తెలుసును. ఆ విషయంలో అంతకన్న ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదు. అయితే ఈ సమస్య ఎందుకు బయలుదేరింది అంటే—మొట్టమొదట Agrarian reforms తీసుకువద్దామని అనుకొన్నారు. సాధారణంగా వందలాది ఎకరాలు భూమిఉండి దానినంతా ఒక వ్యక్తి సాగుచేస్తూఉన్నప్పుడు ఆ భూమి సస్యానుకూలంగా వ్యవసాయం చేయలేడనో నీటి సరఫరా చేయలేకనో లేక భూమిని విరివిగా బలపరచలేకపోవడం కారణాలవల దేశంలో ఎకరానికి పండవలసిన పూర్తి పంట పండడంలేదు. అందువలననే ఆహారకొరవస్తూఉన్నది. ఆ కారణంచేత ఎంత భూమి అయితే మనిషి వ్యవసాయంచేసి పూర్తిపంటను పండించగలడనే ఉద్దేశ్యంతో మొట్టమొదట Agrarian reforms అనిచెప్పి ఉన్నారు.

ఇప్పుడు ఆ వాతావరణం మారిపోయింది. మన గవర్నమెంటు అమలులోకి వచ్చిన తరువాత అచిరకాలంలోనే అనేక ప్రాజెక్టులు కట్టి నీటిపారుదల పంపిణీ ద్వారా అయితే నేమి, liffing electric ద్వారా అయితే నేమి నీటి సరఫరా చేస్తున్నారు. నీటి సరఫరా చేస్తే పంట పండుతుందా అంటే లేదు. కృత్రిమమైన ఎరువులను కూడా వేస్తున్నారు. పూర్వం పశువుల పేడ, చెత్త మొదలైనవి వేసి వ్యవసాయం చేస్తూఉండేవాళ్లు. కాని వర్తమానంలో మనం వ్యవసాయరంగంలో అగ్రస్థానం వహించాము. మనకు పరిపాలన వచ్చిన తరువాత కూడా control వస్తువుకు అనేక ఇక్కట్లుపడ్డాము. మన గవర్నమెంటు వచ్చిన తరువాత surplus తో ఉన్నామనే విషయం గుర్తుంచుకోవాలి. Agrarian reforms యొక్క సిద్ధాంతం ప్రకారం ఎక్కువ భూమిని సాగుచేసే రైతు తక్కువ పంట పండిస్తాడు. తదూర్పేణా దేశానికి పంటకొరత వస్తుందనే విషయం ఈ రోజులలో వర్తించదని మనవిచేస్తున్నాను. ప్రతిరైతు కూడా కష్టపడి పనిచేయాలి. అందు కేమి అభ్యంతరంలేదు. Land Reforms చేసినపుడు ఏ విధంగా చేయాలి. ఏ రూపంలో చేయాలనే విషయాన్ని సాకల్యంగా చర్చించి, సుస్థిరమైన స్థాయిలో చేయాలనే గవర్నమెంటువారి యొక్క ఉద్దేశ్యం. ఏదో వందలాది ఎకరాలుగల భూస్వాములుఉన్నారు. వారికి 20 ఎకరాలో పది ఎకరాలో, ఇచ్చి మిగతా భూమిని బీదప్రజలకు పంచేసి తదూర్పేణా రాజకీయంగా కొంత బాధ్యతతో ప్రవర్తిద్దామనే ఉద్దేశ్యంతో ఉబ్బులూగి మాట్లాడుతున్నారే గాని ఇది అమలులోనికి ఏ రూపంలో వస్తుందో ఏ స్థాయిలో వస్తుందో గుర్తుంచుకోవాలని మనవిచేస్తున్నాను. అంతమాత్రంచేత వారికి Land Reforms వారియొక్క ఆశాజ్యోతి ఆ విధంగా పరిణమిస్తుందని నేను చెప్పాల్సిన అవసరం కలిగింది. దీనికి తగినటువంటి పరీక్షచేసుకొని ఏ దేశంలో ఎలా చేయాలో, ఎలాచేస్తే అది పైకి వస్తుందనే విషయం ఏ కు సంబంధించి అక్కడ ఉండే ఆచారాలను అనుసరించి చేయమని ప్లానింగ్ కమిషన్‌వారు కూడా అన్నారు. ఏదో ఒక రూపంలోపెట్టుకుని ఆ స్థాయిలో భూములను లాక్కొని పంచెయ్యాలి అంటే అది జరిగేదికాదు. దానికి అనేక కార్యకలాపాలు ఉన్నాయి మేము జాగ్రత్తగా ఆలోచించుకొని, సుస్థిరమైనటువంటి పరిస్థితులలో అచిరకాలంలోనే land reforms తీసుకువస్తామని ముఖ్యమంత్రిగారు కూడా హామీ ఇస్తున్నారు. దానిని గురించి ఇంతవరకు ఏ శాసనంలో ఏ land reforms లేని సందర్భంలో పత్యేకంగా కళా వెంకటార్వుగారు land reforms portfolio న కొత్తగా ఎందుకు నియమించాలో గుర్తించుకోవాలని సోదర సభ్యులకు తమద్వారా మనవి చేస్తున్నాను. ఈ విషయంలో opposition పార్టీవారుచేసే ఉపన్యాసాలకు మేము పెట్టబోయే land reforms యొక్క Agrarian reforms. యొక్క అంతరంగికానికి ఏమి సంబంధంలేదు Socialistic pattern of Society అని చెప్పుతున్నారు." దేశంలో ఒక్క భూమి సంపాదించడమేకాదు. Bankers ఉన్నారు. అనేక సాయిలలోఅనేక రకాలుగా లక్షలాదీ, కోట్లాది ఆస్తులను సంపాదించినవారు ఉన్నారు." సార్వజనిక సాముదాయక సూత్రాల ప్రకారం చూసుకుంటేనే అన్ని రంగాలలోఒకే Level లో

పెట్టాలన్న ఉద్దేశ్యం ఉన్నప్పుడు యోచించేఇస్తారు. Land reforms ముందుపెట్టి తరువాత step by step గా పెడదామనేఉద్దేశ్యంతోటే గవర్నమెంటు చేస్తూఉన్నదనే విషయం గుర్తుంచుకోవాలని మనవిచేస్తూ ఇంతటితో విరమిసు న్నాను.

*Mr. Deputy Speaker :* The House now stand adjourned till half past eight of the Clock on Tuesday, the 16th April, 1957.

(*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the* 16*th April,* 1957.)